# పరాజితులు

## 1

రైలు మామూలు టైముకే వచ్చిచేరింది. చంద్రశేఖరం కంపార్టుమెంటులోంచి దిగుతుండగా ఎదుటిసీటుమీద చాలా మైళ్ళనుంచీ కలిసి ప్రయాణంచేస్తున్న అమ్మాయి నవ్వింది చిన్నగా ఎవ్వరికీ వినపడకూడదన్నట్లు. వదిలిపోయింది పీడ హాయిగా విశాలంగా కూచోవచ్చు అనే భావమేమో మరి అతని చెవులదాకా అమ్మయ్య! అనేశబ్దం వచ్చిచేరింది. చంద్రశేఖరం ఆ అమ్మాయిముఖంలోకి చూశాడు. వెళ్ళిపోతున్నాడు గదా ఇక అతణ్ణెవరు పట్టించుకునేది అనే నిర్లక్ష్యభావం ఆ అమ్మాయి చూపుల్లో ద్యోతకమైంది. అతడికి ఒళ్ళుమండింది. ఆ చిన్నస్టేషన్‌లో రైలు ఐదునిముషాలకంటే ఎక్కువ ఆగదు. అతడు తన పక్కచుట్టా, పెట్టె దించుకొని అక్కడే నిలబడ్డాడు. ఆ అమ్మాయి నేదైనా అంటాడని, అతని కనిపించింది. రైలు కదిలిపోతుండగా వెళ్ళివస్తానని చెయ్యూపాడు. ఆ అమ్మాయి నిర్ఘాంతపోయింది. చూపులతో బెదిరించాడు. చూపులతోనే ఏదో మాట్లాడబోయాడు. ఆ అమ్మాయి బెదిరిపోయింది. అతడికి తృప్తికలిగింది. రైలు వెళ్ళిపోయింది.

స్టేషన్ని వొక్కసారి కలయచూశాడతడు. మార్పులు కనిపించాయి. ఇదివరకు లేంది పచ్చపూలచెట్టుకింద సిమెంటు బెంచీ వొకటి వేశారు. స్టేషన్‌కి వొకపక్కన ముప్పయి గజాల

పొడవు ఇనుపతీగ అల్లారు. చెట్టుకింద పది సోడాలు పెట్టుకుని జీవనం ప్రారంభించినట్లుంది, ఎవరో వొక కొత్తమనిషి. ఆ పచ్చపూలచెట్టు పచ్చపూలు పూసే కాలం ఇదేలావుంది. వొత్తుగా గుత్తులు గుత్తులు పూసి కన్పడుతున్నాయి.

సోడాలమ్ముకునే మనిషి చంద్రశేఖరాన్ని పలకరించాడు. "ఎవరబ్బాయిగోరు తమరు..."

చంద్రశేఖరం చెప్పాడు.

అతనూ చెప్పాడు. తాను సోడాలు పెట్టి నెలరోజులు కావస్తోందిట. మొత్తం నాలుగుసార్లు రైళ్ళు వస్తవి. పన్నెండుకు తక్కువ అమ్మడుట. ఇంకా రైళ్ళు ఎక్కువసేపాగవు. ఎండలకాలం, తనకుర్రాడిని కూడా తెచ్చుకుంటాడుట. "అప్పుడు రెండు డజన్లదాకా అమ్మవచ్చును. ఊళ్ళోనూ, స్టేషన్లోను అమ్ముకుంటే వొక పావలాడబ్బులు రాకపోవు." అదీ అతడు తేల్చిన సారాంశం.

చంద్రశేఖరం సోడా కొట్టించుక తాగాడు.

"ఎట్లావుంది సోడా?" అన్నాడు నారాయణ.

"మన ఊరభావినీళ్ళు."

నారాయణ నవ్వాడు. చంద్రశేఖరానికీ నవ్వొచ్చింది. విన్ పార్లర్‌లో కూచుని, సోడా తాగి, సిగరెట్ కాల్చుకుంటూ పేపర్ చూస్తూ, రోజులు వెళ్ళబుచ్చినవాడు చంద్రశేఖరం. "విశేషాలేమిటి మన ఊళ్ళో?" అని అడిగాడు చంద్రశేఖరం.

"మీరిక్కడే వుంటారుగా. ఒక్కొక్కటి అవే తెలుస్తవి" అన్నాడు నారాయణ.

స్టేషన్‌మాష్టరు చంద్రశేఖరందగ్గరికొచ్చి టికెట్ తీసుకున్నాడు. స్టేషన్‌మాష్టరు మారాడు. చంద్రశేఖరానికి వరలో పరిచయంలేదు. చంద్రశేఖరం బయల్దేరాడు. నారాయణ ఇంకొకగంటపోతేగాని రాడు. మళ్ళీ ఇటువేపు వెళ్ళే రైలు వెళ్ళిపోవాలి. చంద్రశేఖరం మట్టిరోడ్డుమీదకొచ్చాడు. దూరంగా కాలవగట్టున చామకూర దట్టంగా పెరిగివుంది. జ్వరంవచ్చి పీక్కుపోయినమనిషిలా కాలవ యెండిపోయింది. పాలిపోయింది. నీటికొంగలు జీవికను వెతుక్కుంటున్నాయి. దూరంగా అస్తమిత సూర్యబింబం కాలవనీళ్ళలో ప్రతిఫలిస్తోంది. నీళ్ళు శోణవర్ణంతో కదలాడుతున్నాయి. చంద్రశేఖరం వొక్కక్షణం నిల్చుండిపొయ్యాడు ఆ దృశ్యాం చూసి. చిన్నతనంలో సాయంకాలం అతడు స్నేహితులతో కలిసి కాలవగట్టున తిరిగి తిరిగి ఆడుకునేవాడు. వెంకయ్యగారి పొలంగట్టున మఱ్ఱిచెట్టు వుంది. ఆ మఱ్ఱిచెట్టునానుకొని, కాలవ ప్రవహిస్తోంది. వాళ్లు పందేలుపెట్టుకుని చెట్టెక్కి అవతలగట్టున దిగేవాళ్లు. ఊడలు యీవలనుంచి ఆవలకు వంతెనలుకట్టి కుఱ్ఱకారు పిల్లమూకకి ఉషారు కల్పించేవి. ప్రొద్దస్తమానం వాళ్ళకదే పని. వఃగబియ్యం, నిమ్మపండ్లూ, నారింజకాయలూ, వేరుశనగకాయల కాలంలో అవీ, వాళ్ళ ఖాద్యవస్తువులు. రోజుకొకరువంతున ఏదైనా తినేపదార్థం తేవల్సిందే. ధర్మసమ్మతంగా అందరికీ పంచవల్సిందే. మఱ్ఱిచెట్టుకింద సర్వకాల సర్వావస్థలయందూ, (వొక్క వానాకాలం ఎక్కువగా అక్కడికి చేరేవారు కారు) గోడీబిళ్ళలూ, గోలీకాయలూ, గచ్చకాయలూ ఆడుకునేవాళ్ళు. కాస్త పెద్దవాళ్ళయినతర్వాత

శెట్టిగారి సుబ్రమణ్యాం బీడీలు తేవటం నేర్చాడు. వాళ్ళయ్య కొట్టుకాడ ఉండనప్పుడు బలే పరంమగా వుండేది వాడికి. కాని చచ్చినా కలకండ తెచ్చేవాడు కాదు. వెంకయ్యగారిసుబ్బడు బీడీలుకాల్చటంలో ఫస్టు పాపం! వాడు—వాలుగేంట్లు కావస్తోంది—పాముకరచి చచ్చిపోయి పాముల నరసయ్యకి కబురంపించారు. కాని ఆ లోపునే వెంకయ్యగారి సుబ్బడు చచ్చిపోయాడు. ఇప్పుడుకూడా వాడితల్లి చంద్రశేఖరాన్ని, ఇంకా ఇతరనేస్తుల్ని చూచినప్పుడు యేడుస్తుంది. సుబ్రమణ్యాం కొట్టుపనుల్లో మునిగాడు తర్వాత. చౌదరిగారి పుల్లయ్యకి చదువురాలేదు. తాను చిన్నగా చదువుకొని, పెద్దవాడైనాడు.

చంద్రశేఖరానికి ఆ మఱ్ఱిచెట్టును చూస్తే పురాస్మృతులు మనస్సును మెలిపెడుతవి.

ఇప్పుడు ఆ మఱ్ఱిచెట్టుని ఆశ్రయించుకుని, లంబాడివాళ్లు బ్రతుకుతున్నారు. చంద్రశేఖరం నడుస్తున్నాడు. క్షితిజంలో చిక్కని నీలం, కాలవలో నీళ్ళూ అతడికి ఉత్సాహపూరిత దృశ్యాలుగా అవుపించాయి. అరుణసంధ్యా, నీలాకాశం, ఇంత అందమైన ఊహలు రేపుతాయి అని కానీ, మనస్సుకి ఇంచక్కా ఆలోచనలు రేపుతాయి అని కానీ అత డిదివరలో యెరుగడు. సాయంకాలం ఏ ఉడిపి హోటల్లోనో కాఫీతాగి, సిగరెట్ వెలిగించుకొని, రద్దీ ఎక్కువైనబజార్లలో, కొంపలు మునిగిపోతున్నట్లుగా పరుగెత్తుకెళ్లే జనసందోహాన్ని రాసుకుంటూ, సుందరాంగుల నడకలవయ్యారాన్ని తిలకిస్తూ, ఏ పార్కులోనో కాసేపు చేరగిలబడి, రూముకి చేరుకునేవాడు.

స్టేషన్‌నుంచి ఊరు రెండుమైళ్ళదూరానఉంటుంది. అంటే వొక్క క్రోసెడు. నీలాకాశం క్రమక్రమంగా చీకటిచారల్లో మునిగిపోతుంది. అరుణవర్ణం గౌరవర్ణంగామారి; క్రమంగా నలుపులోకి మారుతోంది ఆకాశం. దూరంగా వేణుగోపాల స్వామిఆలయపుగోపురమూ, ధ్వజస్తంభమూ కన్పిస్తున్నాయి. ఆలయంలో గంటలు మోగుతున్నాయి. ఎవరిదో కంఠ స్వరం తియ్యగా—అలలు అలలుగా తేలివస్తోంది. మేకఅఱుపు, దూరంగా ఆవుదూడ అంబారావం, పశులకాపరి కేకలు. అంకె వేస్తోంది వయసులోవున్న కోడె. చాకలివాళ్ళు బట్టలు తీసు కెళుతున్నారు కాలవలో వుతుక్కొని. సంధ్య ఎంత అంద మైనదీ! అనుకున్నాడు చంద్రశేఖరం.

మంగలి రత్తిగాడు సన్నాయి వాయిస్తున్నాడు. క్రిందటి సంవత్సరం వాడు సన్నాయివాయిస్తుంటే వినలేక చచ్చేవాళ్ళు ఊరివాళ్ళంతా. వాడికేమో ఉబలాటం, ప్రొద్దునా, సాయం కాలం శ్రమపడేవాడు. ఇదే కామోసు "సాధనమున పనులు సమకూరు ధరలోన" అంటే. అపస్వరాలు చాలావరకు సర్దు కున్నాయి. ఆహ్లాదం కలిగించకపోతున్నా, కర్ణకఠోరంగా మాత్రం లేదు. ఏదో కృతికూడా వాయిస్తున్నాడులా వుంది. చంద్రశేఖరం, వాడు కనబడితే అభినందిద్దాము అనుకున్నాడు.

మసీదుముందు కొచ్చేవ్వటికి దయ్యంలా పెరిగిన పున్నాగచెట్టు కన్పించింది. ఎవరో నమాజుచేస్తున్నారు. తన వేపు పరిచితులుగూడా వింతగా చూస్తున్నారు. నాలుగు సందులు కలిసికొనే రావిచెట్టుముందుకొచ్చేవ్వటికి వాళ్ళ పార్వతి కన్పించింది చంద్రశేఖరానికి. వెనకవచ్చే చంద్రశేఖ

రాన్ని చూడలేదులా వుంది, బడబడా బడాయిలు చెప్పేస్తోంది నేస్తులతో. ఊరభావినుంచి మంచినీళ్లు తీసుకొస్తోందికాబోల్సు, చంకలో మొయ్యలేనంతబిందె వుంది. ఏదో చెబుతుంటే వెనక నడుస్తున్న చంద్రశేఖరం కొంటెతనానికి "అవునవును"అన్నాడు. పార్వతి వెనక్కు తిరిగిచూసింది. ఆశ్చర్యమూ, ఆనందమూ, సిగ్గూ, ముగ్ధత్వమూ ముంచుకొనిరాగా గబగబా అడుగులు వేసింది. ఇంతలో సరస్వతి ఎదురైంది. భావివేపు వెళ్ళేది వెనక్కు తిరిగింది. ఏమిటాపరుగు అనుకున్నాడు చంద్రశేఖరం. సరస్వతి ఆ పరుగులాంటినడకనుండి ఇంటికెళ్ళి వాళ్ళమ్మతో "అమ్మా చిన్నన్నయ్యో" అని చెప్పినదాకా తేరుకోలేదు. చంద్రశేఖరం నవ్వుకున్నాడు. సరస్వతి పెద్దదవుతోంది. కానీ పసితనం వదలలేదు.

నడకల్లో కొత్తదనం వచ్చింది. కడవెత్తుకొనటంలో కొత్తదనం వచ్చింది. ముఖంలో నో కాంతి, సర్వాంగకాల యందూ సౌందర్యమూ రాసి పోసుకుంది సరస్వతి. కాని వాళ్ళన్నయ్యను చూడగానే గంతులువెయ్యటం మాత్రం మరచిపోలేదు.

చంద్రశేఖరం వాకిట్లో అడుగుపెట్టగానే, సరస్వతి మళ్ళీ కడవెత్తుకుని భావికి పోతూ ఎదురైంది. "పిచ్చి..." అన్నాడు చంద్రశేఖరం.

"చీకటిపడిపోతోంది. ఈ ఒక్కబిందె తేనీ..."సరస్వతి రివ్వున పోయింది.

చంద్రశేఖరం నవ్వుతూ ఇంట్లో ప్రవేశించాడు. నడి మింట్లో సోమిదేవి కూచుని దీపంముందు కాటిక దిద్దుకుంటు

న్నది. చంద్రశేఖరం పెట్టె బేడా నడిమింట్లో పెట్టించి, వొది నను పలకరించాడు.

అమ్మ నడిమింట్లో కొచ్చింది.

సోమిదేవి అక్కడినుంచి లేచిపోయింది.

"నీళ్ళు కాగబెడతాను చంద్రుడూ, అన్న మెప్పుడు తిన్నావో..." అన్నది అమ్మ.

చంద్రశేఖరం మరేం మాట్లాడలేదు.

సోమిదేవి నడిమింట్లోకి వచ్చి, "ఏమయ్యా, స్నానం చేస్తావుగదూ, పొయిముట్టించి నీళ్ళు పెట్టానులే" అంది.

చంద్రశేఖరం సవిమర్శగా సోమిదేవి వేపు చూశాడు. ఆమె చేతబట్టుకునివచ్చిన తుండుగుడ్డలను జారవిడచి పక్కగది లోకి నిష్క్రమించింది.

తుండుగుడ్డలు చుట్టబెట్టుకుని దొడ్లోకి వెళుతున్న చంద్రశేఖరం "ఉక్కదీస్తుందేమిటే అమ్మా?" అన్నాడు.

"రైలుప్రయాణం కదురా" అంది ఆమె

సంభాషణయొక్క ప్రారంభదశ సర్వసామాన్యంగా ఇలానే వుంటుంది.

"సంధ్యమల్లెచెట్టు పూలు పూస్తున్నదే" ఇది రెండవ ప్రశ్న. "అవునురా" ఇది అమ్మగొంతు.

"అరటిగెల ఎన్నాళ్లైందేవ్ వడి?"

ఇన్నాళ్లైంది.

చంద్రశేఖరం నూతిగట్టుమీద కూచున్నాడు.

సోమిదేవి బియ్యంకడిగి బుట్టలో పోస్తున్నది.

"అన్నయ్య ఇంకా రాలేదేం వదినా?"

"రోజూ ఇం తేనయ్యా, ఇంకా సేపటికి గాని రారు."

"ఏం, స్కూలు ఐదింటికే వదులుతారుగా?"

"అసురసంధ్య వేళ ఇంటిపట్టున ఏం తోస్తుంది?"

"అమ్మా! నాన్న ఎక్కడికి కెళ్ళారే?"

"ఆలయానికిరా. ఇంకా ఘామును ప్రొద్దెక్కితేగాని రాకు. కబురు పంపిస్తానులే" అంది అమ్మ.

బిందె ఎత్తుకుని సరస్వతి వచ్చింది.

దారిలో ఎన్నో ఆలోచించుకుందిగావును.

"అన్నయ్యా, ఆచార్లగారితో నువ్వొచ్చావని నాన్నకు చెప్పుకున్నానులే" అంది.

"అమ్మోవ్! సరూ పొడుగెదిగిందే..."

"దాని మొహం. చిక్కిపోయిందిరా" ఇది అమ్మ గొంతు. అమ్మ తప్ప ఇలా ఎవరూ మాట్లాడలేదు. సరస్వతి నవ్వింది. "నేనేం చిక్కిపోలేదు. అన్నయ్యా చిక్కిపోలేదు. ఇదివరలానే వున్నాడు" అంది.

"నీ మొహం. నల్లబడిపోయినాడు" ఇదీ అమ్మ గొంతుకే.

సోమిదేవి ఇంట్లోకి నడిచింది.

"పాపం! వదినకూడా చిక్కిపోతున్నది" చంద్రశేఖరం నవ్వుతున్నాడు. సరస్వతి నోటికి చెయి అడ్డంచేసుకుంది.

"ఒరేయ్, వినపడేను సుమీ" అంటున్నాయి సరస్వతి కళ్ళు.

"ఏం వినపడితే..." చంద్రశేఖరం నవ్వు.

"కొంపలంటుకపోతాయి" సరస్వతి అభినయం. సోమి దేవి తిరిగి వచ్చింది, కాకరపాదుకాయలు కోస్తున్నది.

"వదినా! నువు చిక్కిపోయావట. సరస్వతి అంటోంది" అన్నాడు చంద్రశేఖరం.

"నేనేం అనలేదు" సరస్వతిగొంతులో అసహజత.

"అవును, పెరుగూ, పాలూ పోసుక తినీ, తినీ..." సోమిదేవిగొంతుక ఇది.

"సరస్వతీ మన గేదె పాలివ్వటంలేదూ?"

"యెండిపోతే అమ్మేశారు. మళ్ళీ కొనలేదు."

సోమిదేవిముఖాన గంటుపెట్టుకుంది.

చంద్రశేఖరంమనసు చివుక్కుమంది.

అతడు స్నానంచేసివచ్చి వంచలో మంచంమీద కూచున్నాడు. పైన చుక్కలకేసి చూస్తూ కూచున్నాడు. సరస్వతి మొహాన్ని ఆనుకుని కూచుంది.

"అన్నయ్యా, పరీక్షలు బాగా రాశావురా?"

"ఏదో వ్రాశాను సరస్వతీ" చీకట్లో చంద్రశేఖరం సరస్వతిముఖంవేపు చూడటానికి ప్రయత్నించాడు.

సరస్వతి నిట్టూర్పు అతడిచెవులకు సోకింది.

సరస్వతికి పరీక్షలంటే తెలుసును గాబోల్ను అనుకున్నాడతను.

అతడు వెల్లకిలా పడుకుని చుక్కలకేసి చూస్తూ "రామ్మూర్తిమామయ్యగారిఇంట్లో ఎలా ఎలా వున్నారే?" అన్నాడు.

"ఇప్పుడుకూడా వైరమేనా?"

"ఎందుకూ?"

"ఇదివరలో ఏనాడు పోట్లాడుకున్నారు"

సరస్వతి గలగలా నవ్వింది.

"అప్పుడే మరచిపోయారు అన్నయ్యా: కాని మనింటికి తరుచూ రాడు. ఇంటిపనంతా [illegible]"

సూరిశాస్త్రి ఇంట్లో ప్రవేశించాడు.

సరస్వతి వెళ్ళిపోయింది. సోమిదేవి మామగారికాళ్ళకు నీళ్ళు తెచ్చింది.

కాసేపటికి, సూర్యనారాయణ వచ్చాడు. తమ్ముణ్ణి చూడగానే అతడడిగిన మొదటిప్రశ్న: "[illegible] వ్రాశావు కదూ?"

"అనుకుంటున్నాను"

ఇంక సూర్యనారాయణ ఏమీ పలకరించలేదు. పెళ్ళాంతో హేళనగా, "ఆ [illegible] వాళ్ళ ముఖాన్నే అవమానించి వదిలించాడు" అనే మాటలు అన్నయ్య ఎవరిని గురించి అంటున్నాడో చంద్రశేఖరానికి అంతుపట్టలేదు.

సోమిదేవిముఖభావం చూచి సూర్యనారాయణకి హుషారు తగ్గింది. గమ్మున కాళ్లు కడుక్కొని, అంగవస్త్రం చుట్టుకుని స్నానానికని లేచాడు.

సోమిదేవి అతణ్ణి అనుసరించింది.

తండ్రి తల్లితో "ఎప్పుడొచ్చాడు ఏమిటి?" అని అడుగుతున్నాడు.

చంద్రశేఖరం సరస్వతిని పిలిచాడు.

"ఎవర్ని గురించే అన్నయ్యా మాట్లాడుతున్నది?"
"రామశాస్త్రిమామయ్యగురించే..."
చంద్రశేఖరం ఆశ్చర్యపోయినాడు.
సరస్వతిని తల్లి లోపలికి పిలిచింది.
అంతా భోజనాలకు కూచున్నారు.
తండ్రి చంద్రశేఖరంతో అన్నాడు.
"కలెక్టరాఫీసులో ఖాళీలున్నాయట"
చంద్రశేఖరం విన్నాడు.
"అప్లికేషను పడెయ్యరాదూ?"
"పడేస్తాను."
"ఎంతిస్తారు?" తల్లి అడుగుతున్నది.
"ఇంతా..." తండ్రి చేతులతో అభినయిస్తున్నాడు.
సరస్వతి వాకిట్లో కూచుంది.

సూరిశాస్త్రి చెబుతున్నాడు—రెవిన్యూ డిపార్టుమెంటులో ప్రవేశించినవాళ్లు, ఎంతెంత పెద్దవాళ్ళయినదీ, ఎంతెంత సంపాదించిందీ. ఇంకా మాటాడితే రెండుచేతుల దోచుతున్నారుట.

చంద్రశేఖరం వింటూ కూచున్నాడు. అతగాడికి యీ విశేషాలు నిజంగా అంత ఇష్టంలేకపోయినా వినవలసివస్తున్నది.

సూరి నారాయణ కల్పించుకున్నాడు—

"మా మామగారి మూడోతమ్ముడి నాలుగోకొడుకు తోడల్లుడు గుమాస్తాగా చేరి, తాసీల్దారైనాడు"

సోమిదేవి ఆశ్చర్యంగా వింది.

"అవును, ఆ డిపార్టుమెంటు అలాటిదీ..."

సూరినారాయణ అన్నాడు.

చంద్రశేఖరం నోరువిప్పాడు. "అయినా అంత సుఖ పడే ఉద్యోగాలు కావవి."

సూరిశాస్త్రికి కొంపమునిగిపోయినంత ఆశ్చర్యం కలిగింది. సూరినారాయణ ఇవేమీ పట్టించుకోకుండా సోమిదేవితో కళ్ళతో ఏదో మాట్లాడుతున్నాడు.

వాళ్ళింక ఏమీ మాట్లాడుకోలేదు.

భోజనాలుచేసి లేచారు. ఆడవాళ్ళు కూచున్నారు భోజనాలకు. సూరిశాస్త్రి భాగవతం చదవటానికి శెట్టిగారింటికి వెళ్లాడు. సూరినారాయణ గదిలోంచి బయటకు రాలేదు.

ఆ రాత్రి చంద్రశేఖరానికి చాలాసేపటివరకు నిద్రపట్టలేదు. తండ్రి రావటం, అంతా పడుకుని నిద్రపోవటం అతను గమనిస్తూనే వున్నాడు. రైల్లో తనకు పరిచితమైన ఆ అమ్మాయి మొహం పదేపదే గుర్తొచ్చిం దతడికి.

## 2

ఆ ఊళ్లో ముప్ఫయిదాకా బ్రాహ్మణులఇండ్లున్నయి. రకరకాలశాఖలవాళ్లూ వున్నారు. సూరిశాస్త్రిది బ్రదికిచెడిన కుటుంబం. తాతలనాడు వాళ్ళు లక్షణంగా బ్రతికారు. ఆస్తి పాస్తులతో, గౌరవ మర్యాదలతో హాయిగా బ్రతికారు. సూరిశాస్త్రివాళ్ళ తాత మహావిద్వాంసుడు. తండ్రిహయాంలో తాతసంపాదించిన సిరి తగ్గింది. అదివరకు లక్ష్మీదేవి కాలి అందెలచప్పుడు నిర్విరామంగా ఆ యింట్లో ధ్వనించేది. తండ్రికాలంలో క్రమక్రమంగా లక్ష్మీదేవి యీ

ఇంట్లోంచి ఎప్పుడు పోదామా అని ఎదురుచూడటం మొద లెట్టింది.

సూరిశాస్త్రి పెద్దవాడయేటప్పటికి వాళ్ళింట్లో దరిద్ర దేవత కాలుపెట్టింది. సూరిశాస్త్రి విద్వాంసుడు కాడు. లోకంలో విద్యకు గౌరవం వుంది. విద్యవలన విత్తం అనేమాటకు విలువలేదు. విద్య లేకపోయినా, లౌక్యంవలన హాయిగా జీవించ వచ్చు. అలా జీవించేవాళ్ళు చాలామంది వున్నారు. సూరి శాస్త్రికి లౌక్యంకూడా తెలీదు. అతడు చిత్రమైనవాడు. వాళ్ళ తండ్రే అతణ్ణి అలాచేసిపోయాడు. రోజు రోజుకు తరిగిపోతున్న ప్రతిష్ఠను కాపాడుకొనటంలోనే సూరిశాస్త్రితండ్రి రోజులు వెళ్ళదీశాడు. కాని అతడు వంశగౌరవాన్నీ తాతలనాటి సిరినీ పునఃప్రతిష్ఠచేయలేకపోయాడు. ఆయనే ఒక కూలిపోతున్న వ్యవస్థలో జీవించాడు. సూరిశాస్త్రికి గ్రాహికం తెలిసేటప్పటికి అది కూలిపోనేకూలిపోయింది. కాబట్టి అత డంత బాధపడవల సినపని లేకపోయింది.

పైగా అతడు చిన్నప్పుడే ఇంట్లోంచి పారిపోయాడు. లోకసహజం ఏమిటంటే, పారిపోయినవాళ్లు బాగుపడతారు. ఎన్నో కథల్లో చదువుతాం, ఎంతోమందిని చూస్తాం. చిన్న తనంలో ఇంట్లోంచి పారిపోయినవాళ్ళు విద్వాంసులైగాని, విత్తం గడించిగాని, ఇంట్లో అడుగుపెడతారు. సూరిశాస్త్రి విషయంలో అలా జరగలేదు. సూరిశాస్త్రి చదువుకోనూ లేదు, సంపాదించనూ లేదు. సత్రంభోజనం, మఠం నిద్ర లాగా గడిపేశాడు. అదృష్టం. అతడు చెడిపోనూ లేదు. దారంతెగిన గాలిపటంలా తిరుగుతున్న అతడికి, దురల

వాట్లు పట్టువడలేదు. ఇరవయ్యేళ్ళొచ్చేటప్పటికి అలాడు ఇంటికి చేరుకున్నాడు. అప్పటికి తండ్రి పరిస్థితులతో యుద్ధంచేసి ఘోర పరాజయం పొంది, సంధిచేసుకుని కాలాన్ని వెళ్ళదీస్తున్నాడు. అలాంటి సమయంలో సూరిశాస్త్రి ఇల్లుచేరేప్పటికి ఆ ముసలాయనహృదయం, ఆనందంతో నిండిపోయింది. గుండె పగిలిపోతుందేమో అనిపించింది వతడికి ఆ సంతోషంతో. తాను బ్రతికివుండగా మళ్ళీ కొడుకును చూస్తానా అనుకున్నాడాయన. అలాంటప్పుడు సూరిశాస్త్రి పునరాగమనం ఇంట్లో వాళ్ళందరికి ఆనందాన్నే కలుగచేసింది. సూరిశాస్త్రి వళ్ళొవంచి చదువుకుందామని ప్రయత్నించేశాడు. కాని నిష్ప్రయోజనమైంది. ఇరవైయేళ్ళు వెళ్ళేటప్పటికి సూరిశాస్త్రికి గణపతిపూజ చేయించటం మాత్రమే తెలిసింది.

తండ్రి చావబోతూ వొక మంచిపని చేశాడు. అది పెద్ద పనిగూడా. ఏమిటంటే సూరిశాస్త్రికి పెండ్లిచేశాడు. తర్వాత చచ్చాడు. సూరిశాస్త్రికి పెండ్లిచేసి చావకపోతే, సూరిశాస్త్రి మళ్ళీ దేశాలపాలయ్యేవాడు. అందువలన అది మంచిపని అయింది.

తాను దూరటానికే సందులేదు. మెడకొక డోలా అన్నట్లు పూటగడవని సూరిశాస్త్రి పెళ్ళాన్నెలా పోషించగలడా అనేది చచ్చేముందు ఆయన ఊహించలేదు. ఇదీ చెడు.

కాని ఇందువలన చాలా మంచే జరిగింది. తన యిష్టం వచ్చినట్లు ఎగరకుండా యీ గాలిపటపుకొసధారం వో కొయ్యకు కట్టబడింది.

యేడాదిసూతకం వెళ్ళగానే సూరిశాస్త్రిపెళ్ళాం

కాపరానికొచ్చింది. ఈలోపున సూరిశాస్త్రి బ్రతుకు తెరువు చూసుకొనటంలో అష్టకష్టాలుపడ్డాడు. యాయవారం చేసి కొనటం తప్పనిసరైంది. అలవాటైందాకా అభిమానం కుంగ తీసింది, కాని తప్పలేదు. తన తాత ముత్తాతలు వొకరి కింత పెట్టి, తాముతిని హాయిగా కాలాన్ని వెళ్ళదీశారు. నిరంతరం అతిథిసేవతోనే కాలంగడిపారు. సస్యశ్యామలమైన భూము లను ఏముక్క కాముక్క, ఏచెక్క కాచెక్క విక్రయించారు. తోటలు, దొడ్లు అన్నీ పోయినయ్. వాళ్ళు సుఖంగా వెళ్ళి పొయ్యారు. తనగతి ఇలా కాలింది. చివరకు చెంబు పట్టుకుని గడప గడపా తిరగవలసివచ్చింది. తనకు బాగా గుర్తు. తన తండ్రిహయాంలోకూడా తమఇల్లు సత్రంలా కలకలలాడు తుండేది. "వండ నలయదు వేవురు వచ్చిరేని, అన్నపూర్ణకు నుద్దియౌ నతనిగృహిణి" యన్నట్లు అమ్మ వొక్కనాడూ విసు క్కోటంగాని కసురుకోవటంగాని అతడు చూడలేదు. నిజంగా ఆవిడ అన్నపూర్ణే.

కాని ఇవాళిటికి, ఇన్నాళ్ళకు తనగతి ఇలా కాలింది. భార్యముందు సిగ్గుతో రసాతలానికి కుంగిపోయేవాడు సూరి శాస్త్రి.

అతడికి ఎవరూ లేరు. అతడికి ఏమీలేదు; ఒక్క భార్య తప్ప. అతడికి భార్య కాపరానికొచ్చింది. అతడు భరింపవలసిన వాడైనాడు.

సూరిశాస్త్రికి వొక మగపిల్లవాడు కలిగి పోయినాడు. మలుచూలున మరల వొకపిల్లాడు పుట్టాడు. పిల్లాడిపేరు

సూర్యనారాయణశాస్త్రియని పెట్టారు. ఇది సూరిశాస్త్రి తండ్రిపేరు. సూరిశాస్త్రిభార్యపేరు సుబ్బమ్మ. ఆమె మహా సాధ్వి. ఆ మాట ఆ ఊళ్ళో ప్రతివాళ్ళూ అనుకుంటారు.

సూరినారాయణ పుట్టినతర్వాత సూరిశాస్త్రికి కలిసొచ్చింది. అందుకని సూరినారాయణకి గారాబం. ఆ దంపతులకి ఆ పిల్లవాడంటే ప్రాణం.

వాళ్ళకు మళ్ళీ ఇంకో బిడ్డడు పుట్టాడు. వాడిపేరు చంద్రశేఖరశాస్త్రి అని పెట్టారు. పేరు పిల్లవాడి మాతామహుడిది. ఆయన మహావిద్వాంసుడట. సుబ్బమ్మగారు ఆ పేరు పెట్టాలని కోరుకుంది. సూరిశాస్త్రి అంగీకరించాడు. ఆమె పొంగిపోయింది. రెండవపిల్లవాడు వాళ్ళదరిద్రాన్ని ఇంట్లోంచి వెళ్ళగొట్టాడు.

అందుకే చంద్రశేఖరం అంటే వాళ్లకు అమితగారాబం. వాళ్లమ్మకు మరీని-తండ్రిపేరుపెట్టుకున్నందుకు - తమస్థితి బాగు కావటానికి కారణము ఆ పసిబిడ్డడే అని విశ్వసించినందువల్లనూ.

సూరిశాస్త్రి నాలుగెకరాలభూమి సంపాదించాడు. మూడావులను సంపాదించాడు. సూరిశాస్త్రిని చూచి యీర్ష్య పడ్డవాళ్ళుకూడా లేకపోలేదు. సూరిశాస్త్రిజీవనయానం ఒడిదుడుకులు లేకుండా నెమ్మదిగా సాగిపోతోంది.

తరువాత వాళ్ళకు వో ఆడపిల్ల కలిగింది. ఆ పిల్లపేరు సరస్వతి. పిల్లలు పెద్దవాళ్ళవటం, సూరిశాస్త్రికి మళ్ళీ కష్టాలు ప్రారంభమైనాయి. సూరిశాస్త్రి జీవితగతి మారిపోయింది.

సూరిశాస్త్రి పితామహుడు యజ్ఞం చేశాడు. సూరిశాస్త్రి తండ్రి ఆహితాగ్ని. సూరిశాస్త్రి త్రికాలములందూ సంధ్యావందనం చేసేవాడు.

సూరినారాయణశాస్త్రికి ఎనిమిదవ యేటనే ఉపనయనం చేశారు. పద్దెనిమిదేండ్లువచ్చేటప్పటికి గాయత్రినే మరచిపోయాడతడు. కాఫీ తాగటంకూడా అలవాటైంది. సుబ్బమ్మగారు కొడుకుకోసం ఇంత బెల్లమో, చక్కెరో వేసి ఆవుపాలతో కాఫీ కలిపిచ్చేది. పిల్లలంతా కాఫీ తాగేవాళ్లు. సూరిశాస్త్రిగారు ముట్టుకోడు. సుబ్బమ్మగారు కూడా అంతే.

సూరినారాయణశాస్త్రి పిలక తీసివేయించి క్రాప్ పెట్టించాడు. సూరిశాస్త్రి దానివిషయం ఏమాత్రం పట్టించుకోలేదు. సంస్కృతం చదువుకోవాలంటే రోజూ రెండుమైళ్ళు నడిచిపోవాలి. ఇంగ్లీషు నేర్చుకునేట్లయితే ఉన్న ఊళ్లోనే నేర్చుకోవచ్చు. ఆ ఊళ్లో వో పంతులున్నాడు. ఊళ్లోవాళ్ళంతా ఆయనను మాలపంతులు అంటారు. సూరినారాయణశాస్త్రి మాలపంతులుదగ్గర ఇంగ్లీషుకు కుదిరాడు. సూరినారాయణశాస్త్రి కప్పటికి పదిహేనేళ్లొచ్చినయ్. సూరిశాస్త్రికి కొడుకు ఇంగ్లీషుచదువు చదవటం ఇష్టంలేకపోయినా, అభ్యంతర పెట్టలేదు.

"కాలం మారిపోయింది. సంపూర్తిగా మారిపోయింది. మా తాతవలె మా నాయన బ్రతకలేదు. మా నాయనవలె నేను బ్రతకటంలేదు. వాడిగీత ఎట్లుందో! మనమేం చేస్తాం?" అనుకున్నాడు. సూరినారాయణశాస్త్రికి తన పేరుకూడా మోటుగా వున్నట్లు తోచింది. అందుకని "సూర్యం"గా మారిపోయాడు.

రెండు సంవత్సరాల్లో థర్డ్‌ఫారం పరీక్ష ఇచ్చాడు. తర్వాత హాయ్యర్ గ్రేడ్ పాస్సైనాడు. అతడికి వున్న ఊళ్లోనే ఉద్యోగం దొరికింది. సూరిశాస్త్రి వొకవిధంగా బాగుపడ్డాడని సంతోషించాడు. ఒకవిధంగా చెడ్డాడని ఆత్మపదార్థం ఘోషించింది.

సరస్వతి పెండ్లికెదిగింది. సూరిశాస్త్రి సరస్వతికి సంప్రదాయకంగా పెళ్ళి చేయలేకపోయాడు. సరస్వతి బాగా యెదిగింది. సరస్వతిని చూసినప్పుడల్లా సూరిశాస్త్రికి తనజన్మ అపవిత్రమైపోయిందనీ, వచ్చేజన్మలో తాను బ్రాహ్మణేతరుడుగా పుట్టాల్సివస్తుందనీ బాధపడేవాడు.

చంద్రశేఖరశాస్త్రి చదువుకుంటానికి పట్నానికెళ్లాడు సూరిశాస్త్రి సంపాదించిన నాలుగెకరాలూ "హుష్ కాకి" అయిపోయింది. పైన ఋణమైంది.

సూరిశాస్త్రి ప్రతిరోజూ గజేంద్రమోక్షంలోనిపద్యాలు చదువుకునేవాడు.

సూరినారాయణశాస్త్రికి పెండ్లయింది. సూరిశాస్త్రి కోడలిని ఇంటికి తీసుకొచ్చాడు. ఆమెపుట్టింట్లో సాంప్రదాయమంటే పడిచస్తారు. నిప్పు కడుక్కునే ఆచారవంతులు వాళ్లు. సోమిదేవి అత్తవారింటికి వచ్చి అక్కడి అనాచారమంతా చూసింది. ఆమెకు కళ్ళు తిరిగిపోయినై, వొళ్ళు గగుర్పొడిచింది. అక్కడ తాను బ్రతకలేననుకొంది. ముళ్ళమీద నడుస్తున్నట్లుగానూ, నిప్పులమీద నడుస్తున్నట్లుగానూ బాధపడ్డదామె. మరది కిరస్తానీవాళ్ళచదువు చదువుకోవడం, మరదలు చెట్టంత యెదిగి ఇంట్లోనే వుండటం ఆమెకు భరించలేని వ్యథ కలుగచేసినయ్. అమ్మ! అని నోరునొక్కుకుంది. ఇలా అని

తెలిస్తే తాను యీ ఇంట్లో వచ్చి పడకపోవును అని కన్నీళ్ళు పెట్టుకుంది. తననితాను తిట్టుకొని వాళ్ళలోనే కలిసిపోవటానికి ప్రయత్నించింది. కాని ఆమెప్రయత్నాలన్నీ విఫలమైనయ్.

ఆఖరుకు సూరినారాయణశాస్త్రి క్రాపుకూడా ఆమెకు వెగటైంది. మొగుడితో నిష్కర్షగా చెప్పింది. సూరినారాయణ శాస్త్రికి పెళ్ళామంటే ప్రేమ. పైన పడుచుదనం. అతడు క్రాప్ తీయించేశాడు. మళ్ళీ పిలకపెట్టించాడు. ఈ చిన్న విజయంతో సోమిదేవి ఆత్మశక్తులన్నిటినీ కూడదీసుకుంది. తన వునికిని బలపరచుకుంది. ఇంటికి తానే పెద్దవలె వ్యవహరించటం మొదలెట్టింది.

రోజూ మొగుడితో సరస్వతిపెళ్ళివిషయం హెచ్చరించేది. రెండు మూడు నెలలిలా గడచిన తర్వాత వొకటి రెండుసార్లు మామగారినే హెచ్చరించింది. సూరిశాస్త్రికి తల కొట్టేసినట్లనిపించింది. ఈవరలోనే సరస్వతిపెళ్ళివిషయం తలచుకున్నప్పుడల్లా ఆయనకు కంపరంపుట్టేది.

ఇప్పుడు ఆయనమనస్సుకి కొద్దిగాకూడా శాంతి లేకుండా పోయింది. సరస్వతిని చూసినప్పుడల్లా ఆయనను నిలబెట్టి ఎదురుగా ఎవరో కొరడా ఝుళిపించినట్లుగా అనిపించేది ఆయనకు. ఇప్పుడు కోడలినిచూసినా ఆయన కలానే అనిపిస్తున్నది. తట్టుకోలేక ఆయన ఇంట్లో వుండడమే మానేశాడు. భోజనం వేళకు ఇంటికి రావటమూ, తర్వాత ఆలయానికిపోయి పొగడ చెట్టుక్రింద బండమీద పడుకోవటమూ అలవరచుకున్నాడు. అత్యవసరంకలిగితే కాని ఇంటికి రాడు. ఏ భాగవతమో, ఏ భారతమో తీసుకుని పగలల్లా కంఠంవిప్పి ఆలయంలో

గోడలన్నీ చెవులొగ్గి వినేటట్లుగా పాడుకునేవాడు మధుర ఘట్టాలు.

ఆయనకు ఆత్మశాంతి లభించింది. ఎదురుగా వేణుగోపాలస్వామి చిరునవ్వులుచిందిస్తూ తనని పాడమని కోరినట్లుగా భావించుకుని మురిసిపొయ్యేవాడు. పొగడచెట్టుమీదినుంచి ఉడుతలు కీచుకీచుమంటూ ధ్వనిచేస్తూ సూరిశాస్త్రిపాదాల వద్ద పారాడిపొయ్యేవి. పడిపొయ్యే మొండిగోడను మరీ బలంగా పడేట్లుచేస్తూ విజృంభిస్తున్న రావిచెట్టు ఆయనకి శ్రీమన్నారాయణమూర్తిగా ప్రత్యక్షమయ్యేది. కావలసినంత గాలి, కావలసినంత వెలుతురు, దేవగన్నేరుపూలపరిమిళం, మునిగోరింట పూలు ఆవరణంతా బంగారుకాంతులతో వెలిగింపచేస్తూ ఆయనకన్నులకు మహా ఆనందాన్ని చేకూర్చేవి. గాలివీచినప్పుడల్లా, కమ్మనితులసివాసన. గుడి వెనకాల పెద్దతులసివనం.ఆలయశిఖరంమీద పావురాళ్ళ కువకువలు, ధ్వజస్తంభంమీద చిరుగంటలచప్పుడు.సూరిశాస్త్రిఆనందంతో పులకరించిపొయ్యేవాడు. అతడి శరీరానికి, అతడిఆత్మకి, అతడి పంచేంద్రియాలకు అలసట లేకుండాపోయ్యేది. అరుణసంధ్య, నీలాకాశమూ, గూళ్లుచేరుతున్న పావురాళ్ళూ—వాటి ప్రేమవ్యవహారాలూ చూస్తూ సూరిశాస్త్రి లోకాలను చీకటి ముసురుకున్నదాకా అక్కడే గడిపేవాడు.

"పరూపమ్మున దీని గెల్తు నికమీఁదే వేల్పు
జింతింతు......" అనీ,

"నీవు యశోదబిడ్డడవే నీరజనేత్ర సమస్త
జంతు చేతో విదితాత్మవీశుడవు......" అనీ

"నల్లనివాడు పద్మనయనమ్ములవాడు..." అని కమ్మగా కంఠమెత్తి పాడుకునేవాడు. ఎదురుగా వేణుగోపాలస్వామి. అతడికంఠంలోని స్వరలహరి అమృతమయంగా ఆ ప్రాకారాన్ని ఆవరించుకునేది. అతణ్ణి ఎక్కడెక్కడికో, ఏ లోకాలకో, ఏ చీకట్లనుచీలుస్తున్న వెలుగులలోకో, ఏ మహాయాంత్రికుని పాదసన్నిధికో తీసుకపోయేది. తూలుతూ, సోలుతూ ఇల్లు చేరుకునేవాడు.

మొదట మొదట సోమిదేవికి మామగారిప్రవర్తన ఏ మాత్రమూ అర్థంకాలేదు. తర్వాతతర్వాత విసుక్కుంది. సూరిశాస్త్రి ఏమాత్రమూ లెక్కచెయ్యలేదు.

కాని సూరిశాస్త్రి ఏ యేకాంతాన్ని వాంఛించి, అక్కడికి పొయ్యేవాడో, ఆ యేకాంతం యెక్కువనాళ్లు అతడికి లభించలేదు. మొదట మొదట వొకరో ఇద్దరో వచ్చి కూచునేవాళ్లు. పది పదిహేనురోజుల్లో పదిపదిహేనుమంది చుట్టూ కూచోటం మొదలెట్టారు. రోజూ వేణుగోపాలస్వామి ఆలయంలో భాగవతపురాణం యేర్పాటైంది. పౌరాణికుడు సూరిశాస్త్రి. వినేవాళ్లు ఊరివాళ్లు. పనీపాటా లేని ముసలిముత్తయిదువులూ, పూర్వసువాసినులూ, వైరాగ్యం పెంపొందించుకుంటున్న జవసత్వాలుడిగినవాళ్లూ, పెళ్ళికావాలసిన వడుచుపిల్లలూ చేరేవాళ్ళు. సూరిశాస్త్రికిదీ వొక కాలక్షేపమైంది. కొద్దిరోజుల తర్వాత సూరిశాస్త్రికి చక్కటి చాప తెచ్చి వేశారెవరో. భాగవతం తెరచిపెట్టుకుని చదవటానికి, పీటాన్ని యేర్పాటుచేశారు. ఒకరోజు సూరిశాస్త్రి రుక్మిణీకల్యాణం కథాపారాయణంచేస్తున్నాడు.

“...ని నెమ్మి కన్యల్ గోరరె, కోరదే యెట్టు
రమాకాంతాలలామంబు రాజన్యసేవ
సింహా నావలన నే జన్మించెన
మోహాయుతన్?......”

సూరిశాస్త్రి పులకరించిపోయాడు. కళ్ళలో నీళ్ళు తిరిగినయ్. కంఠం గాద్గద్యంవహించింది. చేతులు జోడించుకుని వ్యాఖ్యానం మొదలెట్టాడు.

“...సింహము పాలి సొమ్ము గోమా
యువు గోరుచందమున మద్విభుడా, చైద్యుడా
నీ పదాంబుజధ్యానరతైన నన్ను చెడి తా
గొనిపోయెదనంచు నున్నవాడ యథార్థ
ము నెరుగ దద్భుతమైన భవత్ప్రతాపమున్...”

సూరిశాస్త్రి పులకించిపోయినాడు. అతడి మనస్సులో ద్వారకానగరం, అగ్నిద్యోతనుడు, రుక్మిణీదేవిసందేశమూ, అన్నీ తిరుగుతున్నాయి,

“..............సీ
యనుకంపన్ విలపింపనేల ప్రతిజన్మల్
నూరు జన్మంబులన్
నిను జింతించుచు ప్రాణముల్ విడిచెదన్
నిక్కంబు ప్రాణేశ్వరా!”

సూరిశాస్త్రి ఎందుకో తలెత్తి చూశాడు. ఎదురుగా మంటపంలోని ఓ స్తంభానికి జేరగిలబడి కళ్ళుమూసుకున్న తన్మయురాలైన సరస్వతిని చూశాడు. కొద్దిగా అవతల తన ధర్మపత్ని. సూరిశాస్త్రి మళ్ళీ మనిషైనాడు. అతడికి ఇల్లూ, వాకిలీ. సంసా

రమూ, పిల్లలూ అంతా గుర్తొచ్చారు. తర్వాత అతడు ఎలానో అవాళ్టికి పూర్తిచేశాడు. సాయంత్రం సరస్వతిని పిలిచాడు "అమ్మా" అని. గడచిన యేడాదిలో తండ్రి తనను అలా పిలవటం యెఱుగదు సరస్వతి. ఆశ్చర్యంతో దగ్గరగా వచ్చింది. ఆనందంతో వుక్కిరిబిక్కిరైంది.

"మధ్యాహ్నం నువ్వెందుకమ్మా గుడికి వస్తావు? వదిన వాళ్ళతే ఇంట్లో వుండొద్దూ? నువ్వు రావొద్దు" అన్నాడు. సరస్వతి తెల్లబోయింది.

"సరేలే నాన్నా" అన్నది. సరస్వతి మళ్లీ గుడికి వెళ్ళలేదు. సూరిశాస్త్రియనను మళ్లీ కుదుటవడ్డది.

3

శెలవులకు ఇంటికొచ్చాడు చంద్రశేఖరం. అతడు పట్నం వెళ్ళగానే శాస్త్రి అని తనపేరుచివర వున్న పదం తొలగించేశాడు. అసలు మనిషికూడా పూర్తిగా మారిపోయినాడు.

అతడు ఇంట్లో అడుగుపెట్టగానే సోమిదేవి నివ్వెరపోయింది. సర్కారువాళ్ళ ఉద్యోగస్తుడెవరో ఏదో పనిమీద ఇంట్లోకి వచ్చాడనుకుంది. మరది అని పోల్చుకోలేకపోయింది. మరదిఅని పోల్చుకున్నతర్వాత, ఓ విధమైన వికారాని! గురైంది. చంద్రశేఖరం వదిన్ని పలుకరించాడు.

"పెళ్ళినాటికీ, ఇప్పటికీ నీలో ఏం మార్పు కనిపించటం లేదు వొదినా!" అన్నాడు.

"నువ్వు అచ్చం దొరలా అయినావు" అన్నది సోమిదేవి. సోమిదేవిహృదయంలో మెచ్చుకోలు లేదు. ఇంక

కొద్దిగా అసహ్యమే వుంది. కాని చంద్రశేఖరం పొంగిపోయి నాడు. సరస్వతి చిన్నపిల్లలా దగ్గరకుచేరి నఖశిఖపర్యంతం పరీక్షచేసింది. చంద్రశేఖరాని కిదివరలో లేని నొక్కుల నొక్కులజుట్టు చూసి ఆశ్చర్యపోయింది. అడుగుదామనుకొంది కాని, నవ్వుతాడేమోనని అడగలేదు.

చంద్రశేఖరం అగ్రహారంలో పదిరోజులున్నాడు. ఆ పదిరోజులూ తోచటంలేదు అని గోలపెట్టాడు. సోమిదేవి ఇష్టానికి వ్యతిరేకంగా యీ పదిరోజులూ ఇంట్లో కాఫీవ్యాపారం సాగింది. "అన్నయ్య ఎప్పుడూ ఇక్కడే వుంటే బావుండును" అనుకుంది సరస్వతి.

చంద్రశేఖరశాస్త్రి వో స్నేహితుడివూరికి వెళ్ళివస్తానని బయలుదేరాడు. అక్కడినుంచి పరీక్షలవిషయం తెలుసుకునేందుకు మళ్ళీ పట్నం పోతానన్నాడు.

అతడు అగ్రహారంనుంచి కదిలేప్పుడు ఇంట్లో చిన్న కల్లోల మొకటి లేచింది. ఓ వందరూపాయలు కావాలని తండ్రి నడిగాడు చంద్రశేఖరం. సూరిశాస్త్రి మొదటిసారి కొడుకు మాటలు వినిపించుకోలేదు. తర్వాత చంద్రశేఖరం మళ్ళీ అడిగాడు. సూరిశాస్త్రి తనవద్ద లేవన్నాడు. చంద్రశేఖరానికి ఇబ్బందైంది. చంద్రశేఖరం వెళ్ళి అన్న నడిగాడు.

నిజానికి సూరినారాయణశాస్త్రిదగ్గర డబ్బుంది. అతడు కొంత కరగిపోయినాడు కూడా.

వెళ్ళి సోమిదేవితో సంప్రదించాడు.

సోమిదేవికి చంద్రశేఖరానికి డబ్బుఇవ్వటం ఇష్టంలేక

పోయింది. సూరినారాయణశాస్త్రి తమ్ముడిదగ్గరకువచ్చి తన దగ్గర డబ్బులేదు అన్నాడు.

తల్లితండ్రులకు సూరినారాయణశాస్త్రిదగ్గర డబ్బున్నట్లు తెలుసు. అయినా వాళ్ళెలా చెపుతారు? చెపితే మాత్రం సూరినారాయణశాస్త్రి తమ్ముడికి డబ్బిస్తాడనియేలా? అందుకని వాళ్లు ముభావంగా వూరుకున్నారు. చంద్రశేఖరం విసుక్కున్నాడు. అతడి కేమీ తోచలేదు. అతడికి ఇప్పుడు డబ్బు అత్యావసరం. ఇల్లంతా రెండుమూడుసార్లు కలయతిరిగాడు. కొట్టంలో అతడికి రెండావులు కనిపించినయ్. తండ్రి దగ్గరకు పోయి, ఆవునమ్మి తనకు కావలసిన డబ్బివ్వమన్నాడు. సోమిదేవికి వొళ్ళంతా కారంరాచినట్లయింది. సూరినారాయణశాస్త్రికి వొళ్లు మండిపోయింది. సోమిదేవి మగడివేపు చురచుర చూసింది. సూరిశాస్త్రి అయిష్టంగానే అంగీకరించాడు. చివరకు ఎలానైతేనేం ఆవును అమ్మేశారు. చంద్రశేఖరం ఆవాళే బయలుదేరి స్నేహితుణ్ణి కలుసుకోవటానికి వెళ్ళాడు. చంద్రశేఖరం వెళ్ళిపోయిన పదిరోజులవరకూ సోమిదేవి అత్తమామలను సాధిస్తూనేవుంది.

"మనం కలసేవున్నాము కదా, ఆస్తి అమ్మితే సగభాగం మాకూ రావాలి కదా" అంది సోమిదేవి. అదే పెద్ద జగడమైంది.

సుబ్బమ్మగారు చిన్నకొడుకును వెనకేసుకొచ్చింది.

"నీ మొగుడు చదువుకున్నాడు. సంపాదించుకుంటున్నాడు. వీడుమాత్రం చదువుకోవద్దూ?" అంది.

సోమిదేవి తర్కం లేవనెత్తింది.

"మా ఆయన చదువుకెంతైంది. మహాఅయితే మూడు వందలైవుంటాయి. ఈ ఖర్చులూ, యీ టూపుటూపులూ ఆయనకెక్కడివి? ఆయన వారాలుచేసి చదువుకున్నారు" అంది సోమిదేవి.

సుబ్బమ్మగారు ఎక్కువ మాటాడలేదు. ఆమె కెంతో దిగులైంది. చిన్నతనంనుంచీ తనకొడుకు కష్టసుఖాలను భరించి నట్లుగా సోమిదేవి మాట్లాడటం, తన కొడుకుమీద ఏ మాత్రమూ తమకు హక్కులేనట్లు సోమిదేవి ప్రవర్తించటం తలచుకుని ఆమె విచారపడ్డది. సరస్వతి చిన్నన్నయ్యవతోన మాట్లాడబోయింది. సోమిదేవి మండిపడ్డది. సరస్వతిని చిన్న పుచ్చింది. సరస్వతి చాటుగా యేడ్చింది. తనకు పెళ్ళయి, అత్త వారింటికి వెళ్ళిపోతే, తనను వీళ్లు ఇలా అనగలరా? అని ఎంతో సేపు అనుకుంది. తనకూ వో సంసారం, స్వజనం వుంటే ఎంతో బావుండునని కోరుకుంది. వదిన అంటే మొదట్లో సరస్వతి ఎంతో ఆపేక్షపడ్డది. తన యీడుగల వో అమ్మాయి, తమ ఇంటికి వచ్చి, తమలో కలసిపోయి, తమ కష్టసుఖాలను పంచు కుంటుందని, తలంచుకున్నప్పుడు సరస్వతి కెంతో ఆనందం కలి గింది. తృప్తిగా నిట్టూర్చింది. తన రహస్యాలన్నీ ఆమెకి చెప్పుకోవచ్చు. తన కష్టాలనీ, తన బాధలనీ, తన ఆనందాన్నీ ఆమె బాగా అర్థంచేసుకోగలుగుతుంది. తాము ఎన్నెన్నో రహస్యాలు మాట్లాడుకోవచ్చు. వాళ్ళ ఊరి విషయాలు, వాళ్ళబంధువుల విషయాలూ అన్నీ ఆమె తనకుచెపుతుంది. తన కోర్కెలు, తన ఆశలు, తన రహస్యాలు అన్నీ తను ఆమెకు వెల్లడించుకుంటుంది. తామిద్దరూ ఎంతో అన్యో

న్యంగా, విడదీయలేని బంధంతో వుండిపోతారు. తాను పెళ్ళయి అత్తవారింటికి వెళ్ళేప్పుడు తనకు ఎంతో బాధకలుగు తుంది. కాని తనకుకూడా అక్కడ నో ఆడపడుచు వుండ కూడదూ? కొద్దిరోజుల్లోనే ఆ అమ్మాయిస్నేహంలోపడి తను వదినను మరచిపోతుంది. అమ్మో అలా జరుగుతుందా? తా నెప్పుడూ ఇక్కడికి వచ్చి పోతూవుంటుంది గదా! వదినని ఎలా మరిచిపోగలదూ?

ఇలా ఇలా ఎన్నోవూహించుకున్నది సరస్వతి. అన్నయ్య పెళ్ళిలో తాను వదినను అంటిపెట్టుకునే తిరిగింది. ఎప్పుడూ ఆమెతలలో పూలు సవరిస్తూనో, కొంగు పైకిలాగుతూనో అంటి పెట్టుకుని తిరిగింది. అందరూ మేలమాడారు కూడా. కాని సర స్వతి ఆపేక్షనూ, అంతఃకరణనూ సోమిదేవి కొద్దిరోజుల్లోనే గాయపరచింది.

సోమిదేవి అత్తింట అడుగుపెట్టినతర్వాత సరస్వతి, ఆమె నెలాగైనా తనకు సుముఖంగా చేసుకుందామని ఎంతో ప్రయ త్నించింది. కాని సోమిదేవి తనమరదలిని గౌరవించలేక పోయింది సరికదా, ప్రేమించనుగూడా లేదు. ఆపేక్ష చూపెట్టలేదు.

అందుకనే వాళ్ళమధ్య అఘాతాలు యేర్పడ్డాయి. వాళ్ళు అవసరానికి మాట్లాడుకుంటారు. అంతే—

సూరినారాయణశాస్త్రికైనా సరస్వతినిచూస్తే ఎక్కువ ఆపేక్ష లేదు. అతడు వొకరకమైన చిత్రమైన మానవుడు. అత డికి మనసుల విలువలు అర్థంకావు. డబ్బుకున్నవిలువ, డబ్బున్న వాడికున్నవిలువ ప్రపంచంలో మరి దేనికీ వుండదని అతడు

గాఢంగా విశ్వసిస్తాడు. సరస్వతి తన సంసారానికి మొయ్యలేని బరువు అని అతడి విశ్వాసం. అందుకని తల్లిదండ్రీ దిగులుపడు తున్నారు. అతడు బాధపడుతున్నాడు. సోమిదేవి విచారపడు తున్నది. చంద్రశేఖరానికి వేమీ లేవు.

సరస్వతి అంటే అతడికి వెర్రిఆపేక్ష. తనకంటే సరస్వతి నాలుగైదేళ్లు చిన్న. చిన్నతనంలో ఎప్పుడూ చంద్రశేఖరాన్నే అంటిపెట్టుకుని తిరిగేది. ఎవరైనా తన చెల్లెల్ని ఆటల్లో కొట్టి తిట్టి యేడ్పించేపక్షంలో, అతడు వాళ్ళను బాగా హింసించే వాడు. ఎప్పటికైనా చిన్నన్నయ్యే తన కష్టసుఖాలబరువు తన మీద వేసుకుంటాడు అనుకునేది సరస్వతి.

సూరిశాస్త్రి మామూలుగా వేణుగోపాలస్వామి ఆల యంలో పురాణంచెపుతూనేవున్నాడు. సుబ్బమ్మగారువొక్కత్తె ఆలయానికి వెళ్ళేది. సరస్వతి ఇంట్లోనే వుండిపోయేది. సోమిదేవి పడమటిగదిలో నిద్రపొయ్యేది. లేకుంటే కాసేపు వత్తి ముందు వేసుకుని వత్తులు చేసేది. సరస్వతితో మాట్లాడేదిగాదు. సర స్వతి కేమీ తోచేదికాదు. ఎక్కడికి వెళ్లాలన్నా తనకు అను మతిలేదు. తను ఎక్కడకీ వెళ్ళకూడదు. వదిన ఏమైనా అంటుం దేమోనని భయం. సరస్వతికి ఇంటివ్యవహారాలు తలచుకున్నప్పు డల్లా విసుగుపుట్టేది. తను ఇంత త్వరగా ఎందుకు పెద్దదాన నైనానా? అని అనుకునేది. ఆ తలపురాగానే తెలియకుండానే నవ్వుకునేది.

ఒకరోజు మధ్యాహ్నం పంచలో నిల్చుని "నేను రామ్మూర్తి మామయ్యగారింటికి వెళుతున్నా వదినా" అన్నది సోమిదేవికి వినపడేట్లుగా.

"నీ యిష్టమమ్మా, నా కెందుకు చెప్పాలి?" అని సాగ దీసింది సోమిదేవి.

"నే నెక్కడ కెళ్ళిందీ నీకు తెలియటాని కొదినా" అంది సరస్వతి అడుగులు కదులుస్తూ.

"ఎక్కడికైనా వెళ్ళవమ్మా, ఎక్కడికెళ్తే నాకేం" అంది సోమిదేవి. సరస్వతి వాకిలి దాటుతుండగా యీ మాటలు వినపడ్డాయి.

సరస్వతి నాలుగుసందులు కలుసుకునే రావిచెట్టు ముందుగా రామ్మూర్తిగారింటి కెళ్ళింది. వాకిలి దగ్గరగా వేసి వుంది. అయినా సరస్వతి నెట్టలేదు. అరుగెక్కి కిటికీగుండా తొంగిచూసింది. పెద్దఅరుగుమీద పార్వతి వొక్కతే వామన గిల్లలు ఆడుకుంటున్నది.

సరస్వతికి మనసంతా ఉత్సాహంతో నిండిపోయింది. తలుపులు నెట్టేసి ఇంట్లో ప్రవేశించింది. పార్వతిముఖం ఆనందంతో వెలిగిపోయింది. పార్వతి కలలోనైనా వూహించనంత పెన్నిధి దొరికినంత సంబరపడ్డది. వెంటనే సరస్వతితో మాట్లాడటాని కేమీ తోచలేదు పార్వతికి. రామ్మూర్తి వొక్కసారి తలెత్తిచూసి "సరస్వతా!" అని ఆశ్చర్యపడ్డాడు. సరస్వతి ఒక్క అంగలో ఇంట్లోకి వెళ్ళిపోయింది. పార్వతి లేచి స్తంభాన్ని ఆనుకుని అలానే నిలబడిపోయింది. సరస్వతి లోపలనుంచి పెద్దగా నవ్వుతూ "ఏమమ్మో వదినా! ఇలా రా" అని పిలిచింది. పార్వతి చెంగున ఇంట్లోకి పోయింది. ఇద్దరినవ్వులూ యేకమైపోయి ఇల్లంతా ఆవరించిపోయింది.

రామ్మూర్తి సరస్వతిని పలకరించాడు.

"ఏం కోడలా! మా ఇంటిమీద అకారణంగా దయ కలిగింది?"

సరస్వతి నవ్వుతూ "మాకు ఉత్తరాలేమైనా వచ్చాయేమోనని మామయ్యా!" అంది

"నే నలానే అనుకున్నానులే" అన్నాడు రామ్మూర్తి.

"కొంటెమాటలు పోనివ్వన్నావు కావు" అంది రామ్మూర్తి భార్య.

"అ కాస్త మూడుముళ్ళూ పడితేకాని యీ ఎగురు అణగదు" అని కలిపింది.

సరస్వతి కోపాన్ని అభినయించి "అందుకే మీ ఇంటికి రానత్తా!" అంది.

"అయితే నువు పెళ్ళి చేసుకోవుటమ్మా" అంది ఆమె.

"మీ పార్వతిపెళ్ళెప్పుడు?" సరస్వతి అడిగింది.

ఆమెముఖం కాస్తా దిగులల్లుకుంది.

"దైవనిర్ణయం" అని నిట్టూర్చింది.

"మా చిన్నన్నయ్యున్నాడుగదా!" అంది సరస్వతి.

ఆమె మళ్ళీ నిట్టూర్చింది.

"రాసిపెట్టినవాడు రాకపోతాడా?" అన్నది.

"మీ పెద్దన్నయ్య అకారణంగా నామీద కత్తుగట్టాడు. పోనీ అదంతా సమసిపోయింది గదా! ఇప్పటికీ నేనంటే క్రోధంగానే వున్నాడు" అన్నాడు రామ్మూర్తి.

"అతగాడితత్వమే అంత మావయ్యా" అన్నది సరస్వతి.

"నే నేం చేశాను సరసంతీ ఇంగులో?"

"పోనీ మామయ్యా, మా పెద్దన్నయ్యతో నీ కేంపని? మా చిన్నన్నయ్యకి ఇష్టమైతే సరి" అన్నది సరస్వతి.

"అలా ఎట్లా జరుగుతుంది సరస్వతీ? అయినా నా బిడ్డ సుఖపడటానికేనా ?"

"ఎందుకు మామయ్యా నీ కా భయం? చిన్నన్నయ్య ఎప్పుడూ ఇక్కడే వుండిపోడు గదా! ఎక్కడో ఉద్యోగం చూసుకుని వెళ్ళిపోతాడు. పార్వతికూడా 'చల్ మోహాన రంగా' అంటూ వాడితో వెళ్ళవచ్చు" అన్నది. పార్వతి ముఖంలోకి చూసింది. పార్వతి ముఖంమీద ఇంద్రధనుస్సులాంటి హావభావాలతో రంగులు మార్చుకుంది.

"అదంతా దైవకృప" రామ్మూర్తి వెళ్ళిపొయ్యాడు.

"మాకు ఉత్తరాలు లేవుకదూ మామయ్యా?"

రామ్మూర్తి సమాధానంగా నవ్వాడు.

రామ్మూర్తిభార్య సరస్వతిని కూచోబెట్టింది. సోమిదేవిగురించి చర్చవచ్చింది. పార్వతీ, వాళ్ళమ్మా సోమిదేవికి కలుపుగోలుతనం లేదని తేల్చారు. "అదో తరహా మనిషిలే" అంది సరస్వతి.

పార్వతీ, సరస్వతీ వామనగిల్లలాడటానికి కూచున్నారు.

"మా అన్నయ్యని చూశావా పార్వతీ!" అని అడిగింది సరస్వతి.

"మీా అన్నయ్యని నే నేం చూడాలమ్మా" అన్నది పార్వతి సుతారంగా.

"పాపం!" అన్నది సరస్వతి.

పార్వతి పెదవులు బిగబట్టి నవ్వింది.

సరస్వతికి నవ్వాగిందికాదు.

"మా అన్నయ్య రాగానే ఏమడిగాడో తెలుసునా?" అన్నది సరస్వతి.

పార్వతి వుత్సాహంతో చూసింది.

"అయినా మా అన్నయ్య సంగతి నీ కెందుకులేమ్మా" అన్నది సరస్వతి.

పార్వతి సిగ్గుపడ్డది.

"నీగురించే అడిగాడు పారూ!"

పార్వతిముఖం ఎఱ్ఱబడ్డది లజ్జతో. గులాబిపూల ఎఱుపు దనం నిండింది.

"ఊహూ" అన్నది.

"అవును సరూ, వాళ్ళపార్వతి చాలా పొడుగెదిగింది కదే. నేను గుర్తుపట్టలేకపోయినాను, ఇందాక రావిచెట్టుకింద కనపడ్డది. ఇవి వాడిమాటలమ్మోయ్!" సరస్వతి అచ్చు చంద్రశేఖరంలా అభినయం చేసింది. "పోమ్మా, నువ్వు మరీనూ!" అన్నది పార్వతి లజ్జాభరంతో. అలా అన్న దేకాని సరస్వతి చెప్పిన మాటలన్నీ పార్వతికి ఎంతో ఆహ్లాదాన్ని కలిగించాయి. ఇంకాసేపు సరస్వతి ఇలానే మాటాడితే బావుండు ననిపించింది.

"ఇదంతా అబద్ధంకాదు పార్వతీ."

"సరేలేమ్మా" పార్వతి ముఖంలో చిరునవ్వు దాచుకుంది.

"నువ్వు దొంగపిల్లవు"

పార్వతి మాట్లాడలేదు.

"నీకూ వాడంటే ఇష్టమే?"

"ఊఁ, నాకేం లేదు"

సరస్వతి పార్వతిబుజంమీద పొడిచింది.

"నాకు తెలుసులే" అన్నది.

"తెలిస్తే తెలుసుకోరాదుటమ్మా."

"అంత కోపమెందుకూ?"

"నువ్వు వూర్కేనే వేధిస్తావు"

ఇంటికి వెళ్ళటానికి లేచిందాకా పార్వతిని వుడికిస్తూనే వుంది సరస్వతి. పార్వతి సిగ్గుతో ముకుళించుకునిపోతూనే వుంది.

సరస్వతి ఇంటికి వెళ్ళేటప్పటికి అమ్మ ఇంకా ఆలయంనుంచి రాలేదు. సోమిదేవి విసుక్కుంది.

## 4

రామ్మూర్తికి పది పన్నెండేళ్ళక్రింద పదిపన్నెండెకరాల పొలము వుండేది. తల్లీ తండ్రీ అప్పటికి బ్రతికేవున్నారు. తండ్రి అంతో ఇంతో సంపాదిస్తుండేవాడు. కాని తరువాత పరిస్థితులు తారుమారైనయ్. తల్లీ తండ్రీ పోయినతర్వాత తాతలనాటి ఆస్తికూడా కరిగిపోవొచ్చింది.

రామ్మూర్తి సూరినారాయణశాస్త్రికంటే పదేళ్ళు పెద్ద. సూరినారాయణశాస్త్రికంటే ఆ వూళ్ళో ముందు అతడే నాలుగు ఇంగ్లీషుముక్కలు నేర్చుకున్నాడు. సూరినారాయణకి అభిమానంతో చదువు చెపుతూండేవాడు కూడా. సూరినారాయణశాస్త్రి తర్వాత మాలపంతులువద్ద చేరి చదువుకున్నాడు.

రామ్మూర్తి ప్రైమరీ ప్యాసయ్యేటప్పటికే ఇంటిపరిస్థితులు తారుమారైనాయి. అందుకని అతడు చదువుకు విధిగా స్వస్తి చెప్పాల్సివచ్చింది. గబగబా వేదంలో కొంతభాగం చదువు కున్నాడు. పౌరోహిత్యం పోగొట్టుకోకుండా నిలబెట్టుకున్నాడు. ఊళ్లో నలుగురిలో మంచివాడనిపించుకున్నాడు. అతడిమాటకు విలువవుంది. తక్కువకులాలవాళ్లు తగవులాడుకుని వచ్చేవాళ్లు. ఇతడు 'చెప్పినవిధంగా వాళ్ళసమస్యలని పరిష్కరించుకునేవాళ్లు. పెద్దలయెడ వినయవిధేయతలూ, చిన్నవాళ్ళయెడ ఆదరణా చూపిస్తూ నలుగురిలోనూ మంచివా డనిపించుకున్నాడు.

మొదలు మొదలు సూరినారాయణశాస్త్రికూడా రామ్మూర్తి అంటే అభిమానంగా వుండేవాడు. కాని తర్వాత తర్వాత వాళ్ళమధ్య సుహృద్భావనం మాయమైంది.

అందుకు కారణం: ఒక కథ.

అగ్రహారంలో పోస్టాఫీసు పెట్టాలని సర్కారువాళ్లు యోచనలుచేశారు. అందుకు కారణం చంద్రశేఖరమనికూడా చెప్పొచ్చు. చదువుకునేరోజుల్లోనే సర్కారువాళ్ళకి దరఖాస్తులు పంపించేవాడు. వాళ్ళు మళ్ళీ ఉత్తరాలువ్రాశారు చంద్రశేఖరానికి. చంద్రశేఖరం కొంత తంటాలుపడ్డాడు. చిట్టచివరి కెలా అయితేనేం అక్కడ పోస్టాఫీసు పెట్టటానికి సర్కారువాళ్లు నిశ్చయించారు. సూరిశాస్త్రి ఊళ్లోవాళ్ళందరికీ తనకొడుకు తెలివితేటలనుగురించి సగర్వంగా చెప్పుకున్నాడు. నిజంగా సూరిశాస్త్రి సంతోషించటంలో ఏమాత్రమూ తప్పులేదు.

అయితే అప్పటినుంచే ఆరంభమైంది ముసుగులో గుద్దులాట. మాలపంతులు మూడురోజులకోసారి జిల్లాకార్యాలయా

నికి పోయిరావటం మొదలెట్టాడు. రామ్మూర్తి కొన్నాళ్లు రోజూ వెళ్లాడు. సూరినారాయణశాస్త్రి రోజూ మహారాజశ్రీ... ఫలానివారి దివ్యసముఖమునకు అని ఉత్తరాలు వ్రాసుకు నేవాడు.

ఈ ముగ్గురిమధ్యనే గట్టి పోటీ ప్రారంభమైంది. ఎవరి ఆదరువుకోసం వాళ్ళు ప్రాకులాడటంలో తప్పులేదు. ఎవరి బలాబలాలు వాళ్ళు తేల్చుకోవటానికి సంసిద్ధులైనారు. ఒకరికొకరు చెప్పకోకుండా, ఒకరితో ఒకరు మాట్లాడకుండా, ఒకరికొకరు కనపడకుండా ప్రచ్ఛన్నయుద్ధం సాగించారు, ఎదిరిచేసే ప్రయత్నాల నన్నిటినీ ఒకకంట కనిపెడుతూనే!

ఓ రోజు సూరినారాయణశాస్త్రి పనిగట్టుకుని రామ్మూర్తి గారింటికి కెళ్ళాడు. రామ్మూర్తి జపంచేసుకుంటున్నాడు. పార్వతి కప్పటికి పదేళ్ళుంటాయి. "పెద్దబావ నీకోసం వచ్చాడు నాన్నా" అని వచ్చి తండ్రితో చెప్పింది.

రామ్మూర్తి హడావిడిగా లేచి వచ్చాడు.

సూరినారాయణశాస్త్రి ఉద్ఘాతం లేకుండా వచ్చిన పని బయటపెట్టాడు. "మనం ఒకరికొకరుకాకుండా పనిచేస్తుంటే నడుమ ఆ మాలపంతులు కొట్టుకపోతాడు" అన్నాడు సూరినారాయణశాస్త్రి.

"దైవనిర్ణయం ఎలావుంటే అలా జరక్క తప్పుతుందా? ప్రాప్తాప్రాప్తాలు మనచేతిలో వున్నాయా?" అన్నాడు రామ్మూర్తి.

సూరినారాయణశాస్త్రికి వళ్ళు మండిపోయింది. ఇలాటి వేదాంతంచెప్పి తాను కాజేయాలనుకుంటున్నాడు అనిపించింది అతడికి. "అలాకాదు, మనలో ఎవరమైనా ఒకరం తప్ప

కుంటే ఆ మాలపంతులికి కాదు” అన్నాడు సూరినారాయణ శాస్త్రి.

రామ్మూర్తి మౌనంవహించాడు.

సూరినారాయణశాస్త్రికి గుండంతా కొట్టుకలాడింది. ఏమి చెప్పటానికీ తోచలేదు.

చివరకు సూరినారాయణశాస్త్రి తేల్చాడు.

రామ్మూర్తి దిగులుగా చూశాడు.

“నా పరిస్థితులు నీకు తెలియకపోలేదు సూరినారాయణా! సంసారం జరక్కనే బాధపడుతున్నాను. కనీసం రెండేళ్లు గడిచేసరికైనా పిల్లపెళ్ళి చెయ్యాలి. ఇది గనక అయిందంటే ఏదో ఉన్నఊళ్లోనే ఇరవైయ్యో పాతికో తెచ్చుకుంటాను. పౌరోహిత్య మొకటి వుంటుంది. ఎలానో బ్రతక వచ్చు” అన్నాడు.

సూరినారాయణశాస్త్రి కిదేమీ నచ్చలేదు.

రామ్మూర్తి చెప్పాడు, “ఆ రెండు ఇంగ్లీషుముక్కలూ రాకపోతే నేను గమ్మున వూరుకునేవాణ్ణి. వచ్చు కాబట్టే ప్రయత్నిస్తున్నాను. అయ్యో సూచనలుకూడా వున్నాయి”

సూరినారాయణశాస్త్రికి ఒకవిధమైన నీరసంవచ్చింది. కోపంకూడా వచ్చింది.

“నువు మానుకుంటే నా కవుతుంది. నేను మానుకుంటే నీకు కాదు, మాలపంతులు కవుతుంది” అన్నాడు సూరినారాయణశాస్త్రి.

రామ్మూర్తి అందుకు ఒప్పుకోలేదు.

సూరినారాయణశాస్త్రి చాలా చెప్పాడు.

కోపంతో వెళ్ళిపోయ్యాడు. వెళ్ళిపోతూ "అయిన వాళ్ళు బాగుపడటం నువ్వు చూడలేవు" అన్నాడు. ఆ మాటలు విని రామ్మూర్తి కృంగిపోయినాడు. ఆవాళే జిల్లా ఆఫీసుకు బయలుదేరాడు. అక్కడ మాలపంతులుకే బలంగావుంది పరిస్థితి. రామ్మూర్తికి చాలా దిగులైంది. ఒకవేళ తనకు కాక పోతే చాలా తలవంపులు కలుగుతయ్ సూరినారాయణశాస్త్రి అయినవాళ్ళందరిలో చాటిస్తాడు. రామ్మూర్తి కేమిచేయ టానికి తోచలేదు. అధికార్లను కలుసుకున్నాడు. ఓ నెల రోజులు ఆపి వుంచి తర్వాత ఆలోచిస్తాము అన్నారు అధి కారులు. రామ్మూర్తి ఇంటికి వచ్చేశాడు. సూరినారాయణ శాస్త్రి తర్వాత రెండు మూడు వందలు ఖర్చుపెట్టాడు.

పదిహేనురోజుల్లో మాలపంతులకు పెళ్ళైంది. ఓ పంతులమ్మని చేసుకున్నాడు. ఆమెకుకూడా అక్కడే ఉద్యోగ మైంది. పంతులు రామ్మూర్తిని కలుసుకొని తాను పోస్టు ఉద్యోగంకోసం ఇక ప్రాకులాడనని చెప్పాడు. ఏదో తా మిద్దరూ బడిలోనే ఉద్యోగంచేసుకుంటారు. ఇక దీనికోసం ప్రాకులాడటం యెందుకు ? అన్నాడు.

రామ్మూర్తికి కథంతా భగవత్కృపలా గోచరించింది. తన అదృష్టం పండింది అనుకున్నాడు.

తర్వాత రామ్మూర్తికి పోస్టుమేష్టరైంది.

ఆరోజు రామ్మూర్తి మాలపంతులవాళ్ళింటికి కాయ గూరలూ, పాలూ, పెరుగూ పంపించాడు. ఆవాళంతా సూరి నారాయణశాస్త్రి అవమానభారముతోనూ, కోపంతోనూ, నిరాశతోనూ, ఈర్ష్యతోనూ వేగిపోయాడు. అప్పటినుంచే

రామ్మూర్తి అంటే అతడికి పడదు. ఇది జరిగి రెండుమూడేళ్ళయింది. సూరిశాస్త్రి తాత్కాలికంగా కొంత బాధపడ్డా కాలక్రమేణా మరచిపోయాడు. రామ్మూర్తి అంటే అతడికేవిధమైన యీసూ లేదు.

ఆప్యాయంగా పలకరిస్తాడు. అందరితోనూ బాగానే వుంటాడు.

రామ్మూర్తిగారి కి ఉద్యోగమైన తర్వాత నిజంగా సంతోషించినవాడు చంద్రశేఖరం. అతడు ఎంతో ఆనందంతో రామ్మూర్తిమామయ్యకి. అభినందనలు తెలిపాడు. ఆ సంతోషంలో వాళ్లింటికెళ్ళి ఏమీ తోచక రహస్యంగా పార్వతి బుగ్గ గిల్లి తప్పుకొని వచ్చేశాడు.

సూరినారాయణశాస్త్రికి తర్వాత పెండ్లయింది. సోమిదేవి కాపురానికొచ్చినతర్వాత యీ గతచరిత్రను భర్తముఖతః సవిస్తరంగా వింది. మొట్టమొదట రామ్మూర్తిగారింట్లో ఆడవాళ్లు వోసారి ఏదో సందర్భాన తనఇంటికి పేరంటానికి వచ్చినప్పుడు వాళ్లను సోమిదేవి బాగానే పలుకరించింది. రెండోసారి వాళ్లను చూసి ముఖం మాడ్చుకుంది. అప్పటినుంచీ సోమిదేవి వాళ్లతో ముభావంగా వుంటూవచ్చింది. మొదట్లో వాళ్లు చిన్నబుచ్చుకున్నా, త్వరలోనే సోమిదేవితత్వాన్ని గ్రహించగలిగారు.

అలా వాళ్ళింటికీ వీళ్ళింటికీ ఎడముఖం పెడముఖం అయింది.ముఖ్యంగా రామ్మూర్తి ఎదురుపడితే సూరినారాయణ శాస్త్రి అవతలవీధిలోంచి వెళ్ళేవాడు. అకారణవైరానికి రామ్మూర్తి లోలోపల చాలాచాలా బాధపడేవాడు.

సూరినారాయణశాస్త్రికి కార్డులూ కవర్లూ కావల్సి వస్తే చచ్చేచావయ్యేది. అందుకని ఐదారు నెలలకు సరిపడేటట్లుగా వొకేసారి తండ్రిద్వారానో చెల్లెల్ని పంపించో తెప్పించుకునేవాడు.

అతడికి చాలా రోజులు రామ్మూర్తి తనకువచ్చే ఉత్తరాలను తీసి దాచుకుంటున్నాడనీ, తనకు అందకుండాచేస్తున్నాడనీ, అనుమానం వుండేది. కాని కొద్దిరోజుల్లోనే ఆ అనుమానం అతడినుండి విడిపోయింది.

అయినా అతడు రామ్మూర్తిమీద వుండే యీర్ష్య వదులుకోలేకపోయాడు. అందుకని వీలైనప్పుడల్లా రామ్మూర్తిని ఎగతాళిచేస్తూ, అపహాసిస్తూ పెళ్లాంముందర బడాయిలు చెపుతూ ఆనందించి తృప్తిపడుతుండేవాడు.

మొదలు మొదలు రామ్మూర్తిగారింటికి సరస్వతి వెళ్ళి ఆడుకోవటం సూరినారాయణశాస్త్రికి ఇష్టంలేకపోయింది.

ఆ మాట సరస్వతితో వొకటి రెండుసార్లు అన్నాడు. సరస్వతి ఆ రోజుమాత్రం వెళ్ళేదిగాదు. మరునటిరోజే వెళ్లేది.

సూరినారాయణశాస్త్రి తరువాత పట్టించుకోలేదు. సరస్వతి రోజూ వెళుతుండేది. సరస్వతీ, పార్వతీ సమవయస్కులు. ఒకేనెలలో పుట్టారట. అందుకని చిన్నతననుంచీ వాళ్ళిద్దరి మధ్యా ప్రగాఢమైన బంధం వుండేది. ఎప్పుడూ కలిసి ఆడుకునే వాళ్లు. ఎప్పుడైనా గిల్లి తగాదాలు పెట్టుకున్నా రెండుమూడు రోజుల్లో కలసిపొయ్యేవాళ్లు. నిజంగా వాళ్ళిద్దరూ వొకేయీడు వాళ్ళయినా సరస్వతి పెద్దేమో ననిపిస్తుంది వాళ్ళనుచూస్తే. సరస్వతికంటే కొద్దిపొట్టి. సరస్వతిది చామనచాయ. పార్వతిది

అంతకంటే ఇంకోచాయ యెక్కువ. సరస్వతి ప్రకృతి సెలయేరు పార్వతిప్రకృతి హరిణశాబకపు ప్రకృతి. చిన్న తనంలో వాళ్లు కలిసి బడికి పొయ్యేవాళ్లు, కలిసి చేలలోతిరిగి బంతిపూలు కోసుకొచ్చుకునేవాళ్లు, కలిసి గొబ్బిళ్లు పెట్టుకునే వాళ్లు, కలిసి పాడుకునేవాళ్లు, కలిసి ఆడుకొనేవాళ్లు; ఇద్దరూ కలిసి నోములునోచేవాళ్లు.

బడిలో చంద్రశేఖరం వీళ్ళకంటే రెండుక్లాసులు పెద్ద. చంద్రశేఖరం నాలుగవక్లాసులో చదివేప్పుడు వీళ్లు రెండవతర గతిలో చదివేవాళ్లు. అట్లతద్దెకూ, ఉండ్రాళ్ళతద్దెకూ, ఆడపిల్లలా చంద్రశేఖరం వీళ్ళతోకలిసి గోరింటాకు పెట్టించుకుని తెల్ల వారుఝామున్నే అన్నాలు తిని, ఉయ్యాలలూగేవాడు. వీళ్ళకు కోపంవచ్చి చంద్రశేఖరాన్ని 'ఆడపిల్ల' అని వుడికించేవాళ్లు. చంద్రశేఖరం కొంతసేపు మాటాడకుండా వూరుకుని తర్వాత సహించలేక జడపట్టుకలాగో, జుట్టురేపో, పూలులాగీ వడ్పించే వాడు వాళ్ళను. పెద్దవాళ్ళు కలుగచేసుకున్నతర్వాత చంద్ర శేఖరం పారిపొయ్యేవాడు.

చంద్రశేఖరం వెళ్ళిపోయిన తర్వాత కొంతసేపు వుత్సా హంగా ఉయ్యాలలూగేవాళ్లు. తరువాత వాళ్ళకూ విసుగు పుట్టేది. అప్పుడు చంద్రశేఖరం వుంటే బావుండును అనిపిం చేది వాళ్ళకు. అతగాణ్ణి అనవసరంగా వుడికించి వెళ్ళగొట్టినం దుకు నొచ్చుకునేవాళ్లు. అప్పుడు "నేను పిలుచుకొస్తాను" అని బయలుదేరేది సరస్వతి. పార్వతి నేనూ వస్తాననేది. కాని సర

స్వాతి "ఇప్పుడే పిలుచుకొస్తాను. నువు బొమ్మలపెళ్ళికి సంభారా లన్నీ సిద్ధంచెయ్యి" మని వెళ్ళేది.

సరస్వతి మెుఎట ఇంటికి వెళ్లేది.

అక్కడ చంద్రశేఖరం కన్పించేవాడు కాదు.

అమ్మ నడిగినా, నాన్న నడిగినా, అన్న నడిగినా ఎవ రికీ తెలిదనేవాళ్ళు. సరస్వతికి దిగులయ్యేది. తమను విడిచి ఎక్కడో ఆడుకుంటానికి వెళ్ళినందుకు చంద్రశేఖరంమీాద కోపంవచ్చేది. ఏడ్పు వచ్చేది. నేరుగా బడికివెళ్లి చూసేది. అక్కడ జువ్విచెట్టుక్రిందా, గానుగతిప్పేచోటూ, అంతా వెదికి చూసేది. చంద్రశేఖరం అక్కడ కన్పించేవాడు కాదు సర స్వతికి నిజంగా యేడ్పువచ్చేది. బిక్కముఖంవేసుకుని ఏం చెయ్యటమూ అని ఆలోచించేది. చంద్రశేఖరం ఎక్కడ వుంటాడో, సరస్వతికి తెలుసు. అతడు ఎక్కడా కనపడకపోతే అక్కడే వుంటాడు. కాని అక్కడికి వెళ్ళటం యెలా?

అక్కడికి వెళ్ళినందుకు వోసారి అమ్మ తనని బుగ్గలు సాగదీసి చావచితకగొట్టింది.

"ఇక వెళ్ళను" అని మొరపెట్టుకున్నదాక హింసించింది. సరస్వతికి బాగా గుర్తు. సరస్వతికి అక్కడికి వెళదామనిపించ గానే వొళ్ళంతా భయంతో చెమరుస్తుంది.

అయినా సరస్వతి పిల్లలా అడుగులు వేసుకుంటూ, అటూ ఇటూ భయంగా చూస్తూ రెండుమూాడు సందులు తిరిగి, శివాలయందాటి, రంగువేసినమేడముందుకువచ్చి నిల్చుం టుంది. వెనక్కుతిరిగి భయంభయంగా చూసి ఎవరూ తనని చూడటంలేదని మనసుకి నచ్చచెప్పుకుని వాకిలి దాటుతుంది.

బయట పంచదాటగానే పెద్దహాలు. హాలునిండా ఎటుచూసినా గోడలకు పటాలు. హాలు నడిమధ్య పెద్ద ఉయ్యాలబల్ల. అక్కడ చంద్రశేఖరం ఉయ్యాలబల్లమీద వూగుతూ కన్పించేవాడు. రాధకూడా కన్పించేది. రాధ ఉయ్యాలబల్లని నెట్టుతుండేది. చంద్రశేఖరం ఇంకా కాస్త గట్టిగా నెట్టమనీ, ఇంత పెద్దగా వూపుతావేమనీ గద్దిస్తుండేవాడు. అందుకు రాధ వొకసారి బిక్కముఖంవేయటమూ, వొకసారి విపరీతంగా నవ్వటమూ చేస్తుండేది.

సరస్వతిని చూడగానే చంద్రశేఖరం పొంగిపొయ్యేవాడు. ఎంతో సంతోషం కలిగేది అతడికి. ఆపమని గద్దించేవాడు రాధని.

రాధ వెంటనే తంటాలుపడి ఆపేది. ఓసారి దెబ్బకూడా తగిలింది.

చంద్రశేఖరం దూకి చెల్లెలిచెయిపట్టుకుని ఉయ్యాలబల్లదగ్గరకు నడిపించుకొచ్చేవాడు.

ఎక్కమనేవాడు సంతోషంగా. సరస్వతి భయం భయంగా చూసేది. ఇంటికి వెళదాం, పార్వతితో కలసి బొమ్మల పెళ్ళి ఆడుకుందాం అనేది. రాధ వాళ్ళవేపు ఆశగా చూసేది. వాళ్ళు వెళ్ళటానికి ప్రయత్నిస్తుంటే రాధ అడ్డుపడేది. కలకండ తెచ్చిపెడతాను, మరి మనం ఇక్కడే ఆడుకుందాం అనేది. "నువ్వుకూడా రాకూడదూ మా ఇంటికి" అనేది సరస్వతి. "అమ్మో! మా అమ్మ చంపుతుంది" అనేది రాధ. చంద్రశేఖరం ఇక్కడే ఆడుకుందాంలే అనేవాడు. సరస్వతి భయపడుతూ "అమ్మకు తెలిస్తే కొడుతుంది" అనేది. చంద్రశేఖ

రానికి ఏం చెయ్యటానికీ పాలుపొయ్యేదికాదు. రాధ ముఖం ముడుచుకునేది సరస్వతిని "ను వెళ్ళ"మనేవాడు చంద్రశేఖరం. "అమ్మతో చెప్తాను" అనేది సరస్వతి. చంద్రశేఖరం వొకసారి సరస్వతిని అక్కడే కొట్టేవాడు. ఒకోక్కసారి కలిసి ఇంటికి వెళ్లే వాడు.

ఆ మేడఇంట్లో వొక మంచిఆమె వుంది. ఆమె ఎప్పుడూ రంగురంగుల పట్టుచీరలు కట్టుకునేది. తలలో ఎప్పుడూ పూలు వుండేవి. ఎప్పుడూ తాంబూలం నములుతుండేది. ఆమెను అమ్మ "వొట్టి పాడుమనిషి" అని ఎందుకంటుందో సరస్వతికి అర్థమయ్యేదికాదు. ఆమెకు తాను కనబడితే ఎత్తుకుని ముద్దుపెట్టుకునేది తనను. కలకండ పెట్టేది. అరటిపళ్ళు ఇచ్చేది. ఓసారి రెండరటిపళ్ళు తీసుకెళ్ళి అమ్మకు చూపి, ఆ మేడఇంట్లో ఆమె ఇచ్చిందని చెపితే, అమ్మ తనని వొక్కటంటించి, అవి కుడితి తొట్లో విసిరిపారేసింది. వాళ్ళింటికెళితే వీపు పగలకొడతాననేది.

సరస్వతికి ఎంతో ఆశ్చర్యమయ్యేది. తర్వాత ఎప్పుడూ వాళ్ళింటి కెళ్లేదికాదు. చిన్నన్నయ్యమాత్రం ఎప్పుడూ దొంగ తనంగా వాళ్ళింటికెళుతూనేవుండేవాడు. రాధంటే చిన్నన్నయ్యకి చాలా ఇష్టం. రాధకూడా నాలుగోతరగతి చదువుతున్నది. అందుకే అన్నయ్యకీ రాధకీ చాలా స్నేహం.

చాలారోజుల తర్వాత ఆ మేడఇంట్లోవాళ్ళంతా ఎక్కడికో వెళ్ళిపోయారు. ఎక్కడికి వెళ్ళిందీ ఎవరికీ తెలీదు.

## 5

చంద్రశేఖరం మళ్ళీ పదిహేనురోజుల తరువాత ఇంటి కొచ్చాడు. కాని వొంటిగా రాలేదు. వెంట వో స్నేహితు

డున్నాడు. వంద రూపాయలూ ఖర్చుచేసి వచ్చినట్లుంది, టీపు టాపుగా వచ్చాడు.

ఆ వచ్చిన స్నేహితుడిపేరు రామశాస్త్రి.

రామశాస్త్రి స్ఫురద్రూపి. చంద్రశేఖరంకంటే ఎక్కువ నాగరీకంగా కనపడ్డాడు. చంద్రశేఖరం ఇంటికి వచ్చే వేళకు సోమిదేవిసాధింపు లణగినయ్.

అతడి సిల్కుపంచె, అతడి లాల్చీ చూడగానే సోమి దేవి కనుబొమలు ముడిపడ్డాయి. ఆమెకు వెగటైంది.

రామశాస్త్రి సోమిదేవివైపు లోలదృష్టులు బరిపాడు. సోమిదేవి బెదరిపోయింది. లోపల సోమిదేవి రామశాస్త్రిని లక్ష తిట్టింది. రామశాస్త్రికంఠంలో విపరీతమైన ఆకర్షణ వుంది. చూపుతో మాటాడి మగవారినే ఆకర్షిస్తాడు. అతడి కంఠంలో ఏో విధమైన ఆకర్షణ వుంది. మాట్లాడుతుంటే ఎదుటివాళ్ళు ముగ్ధులైపోతారు. బొమలు గమ్మత్తుగా కుంచించు కుంటాయి. పెదవులమీద ఎప్పుడూ మందహాసం నాట్యం చేస్తూవుంటుంది. సస్మితాననుడన్నమాట.

సోమిదేవిని అతడు చూసినచూపులో సోమిదేవి అతణ్ణి పూర్తిగా అర్థంచేసుకుంది. బెదరిపోయింది. ఎందుకో తెలియ కుండానే భయపడ్డది. తానుస్నానంచేస్తుంటే ఎవరోచూసినట్లుగా ఆమెవొళ్ళు జలదరించింది. రామశాస్త్రి అంటే విపరీతమైన అసహ్యాభావం మొట్టమొదటిసారిచూచినప్పుడే ఆమెకు కలిగింది. అతడిక్రాపు పైకి దువ్వివుంటుంది.

చంద్రశేఖరంబలవంతంమీాద అత డక్కడ నాలుగు రోజు లున్నాడు.

కాళ్లు కడుక్కోటానికి సరస్వతి నీళ్లు తెచ్చింది. రామశాస్త్రితో, చంద్రశేఖరం సరస్వతిని చూపిస్తూ "మా చెల్లెలు" అన్నాడు. రామశాస్త్రి చిరునవ్వుతో సరస్వతి వేపు చూశాడు. సరస్వతి వివశురాలైంది. రామశాస్త్రివున్న నాలుగురోజులూ సరస్వతికి ముళ్ళమీదవున్నట్లే వుంది. రామశాస్త్రి ఎప్పుడు వెళ్ళిపోతాడా? అని ఎదురుచూచింది.

రామశాస్త్రివున్న నాలుగురోజులూ ఇంట్లో రెండు సార్లు కాఫీ పెట్టారు. మధ్యాహ్నంపూట సరస్వతి ఏదో వొక ఫలహారం చేసేది. సోమిదేవికి యీ వ్యవహారం గిట్టలేదు. సరస్వతిని మందలించింది. కాని ప్రయోజనం లేకపోయింది.

రామశాస్త్రి అవాళ సాయంకాలం ఊరికెళతాడనగా సరస్వతిని వొంటరిగా చూసి చంద్రశేఖరం అడిగాడు. "రామశాస్త్రిని పెండ్లి చేసుకోకూడదూ" అని. సరస్వతికి గాలిలో తేలిపోయినట్లయింది. క్షణకాలం చైతన్యం లేదు ఆమెలో. ఇంతలో మళ్ళీ తెలివితెచ్చుకుంది. చంద్రశేఖరం అడిగిందే మళ్లీ అడిగాడు.

సరస్వతికి ఇదంతా వో కలలా తోచింది.

రామశాస్త్రికి తాను తగిన ఇల్లాలు కాగలుగుతుందా? అని యోచించింది. తాను తగదనిపించింది ఆమెకు. ఆమె మాట్లాడలేదు. చంద్రశేఖరం మళ్లీ అడిగాడు.

సరస్వతి తలవంచుకుని చిరునవ్వు నవ్వింది. తన సందేహం చనువుగా అన్నదగ్గర బయటపెట్టింది. చంద్రశేఖరం మరేం మాట్లాడలేదు. సమాధానమూ చెప్పలేదు. నవ్వాడు. అక్కడనుంచి వెళ్ళిపోయాడు. సరస్వతి చంద్రశేఖరం ఏదైనా

చెపుతాడని ఆశించింది. వింటామనుకుంది. చంద్రశేఖరం అలా మాట్లాడకుండా వెళ్లిపోయేప్పటికి ఆమెకండ్లలో కాంతి తగ్గింది. వెంటనే బావిగట్టువద్దకు పరుగెత్తుకుని పోయింది. నడుమహాల్లో రామశాస్త్రి కన్పించాడు. నిల్చుని తల దువ్వుకుంటున్నాడు. బెదరిపోయిన లేడిలా ఒక్కక్షణం నిల్చుండిపోయింది సరస్వతి. కాళ్ళకు బంధాలుపడినట్లయింది. వెనకనుంచి ఎవరో గుంజి నట్లయింది.

రామశాస్త్రి తలయెత్తి సరస్వతివేపు చూసి నవ్వాడు. ఆ నవ్వులో ఎన్నో రహస్యాలు ఇమిడివున్నాయి. సరస్వతి మూగవడిపోయింది. వెంటనే తెప్పరిల్లుకుని సిగ్గుల చిన్నారి రామచిలుకలా తప్పుకొనిపోయింది, అనాళంతా సరస్వతి గాలిలో తేలిపోయింది. ఆకాశంలో వింత అందం, పూలలో కొత్త పరిమళం, ప్రకృతిలో నూత్నోత్సాహం ఆమె అనుభవించింది. నూతనసంసారమూ, వింతవింతఅనుభూతులూ, సరాగాలూ అన్నీ ఆమెకళ్ళముందు తిరిగినట్లనిపించింది.

చంద్రశేఖరం తండ్రిదగ్గరికి వెళ్ళాడు.

"సరస్వతిని రామశాస్త్రి కియ్యగూడదూ?" అన్నాడు. సూరిశాస్త్రి తెల్లబోయినాడు. రామశాస్త్రి ఆస్తిపాస్తులు, కులగోత్రాలూ అన్నీఅడిగాడు. ఋషులు ఎవరెవరన్నాడు. సూరిశాస్త్రి యీ విషయాలన్నిటా పట్టుదలగలవాడు. ఆ సంగతి చంద్రశేఖరానికి తెలుసు. అతడు ఇదివరకే ఇవన్నీ ఆలోచించాడు.అన్నీయెఱుకపరిచాడు.సంప్రదాయం నిప్పులాంటి దని ముందే చెప్పాడు. అన్నయ్యకి కూడా చెప్పమని చెప్పాడు చంద్రశేఖరం.

సూరిశాస్త్రి హడావుడిగా సూరినారాయణశాస్త్రి దగ్గరికి వెళ్లి యీ విషయాలు చెప్పాడు.

సూరినారాయణశాస్త్రికి మొదలు చాలా సంతోష మైంది. చెల్లెలిపెళ్లి పీటలైనంతచౌకలో అయిపోతే బావుండునని పించింది సూరినారాయణశాస్త్రికి. ఇదివరలో అతడు చాలా దిగులుపడ్డాడు. సరస్వతి పెళ్లికెదిగింది. తండ్రి సంపా దన సన్నగిల్లింది తమ్ముడు చదువుతుంటున్నాడు. అతగాడి వల్ల కానీయైనా ఆర్థికసహాయం లభించదు. తనమెడకు చుట్టు కుంటుందేమోనన్న తలంపుతో కొన్నిరాత్రిళ్ళు సరిగా నిద్ర పోలేదుకూడా.

తండ్రివచ్చి చంద్రశేఖరం ఇలా అన్నాడని చెప్పగానే అతడికి సంతోషమైంది. తన కభ్యంతరంలేదని చెప్పాడు. ఈ సువార్తను ఎక్కువసేపు తనకొక్కడికే సంతోషం కలిగిం చటం భరించలేక వెళ్ళి సోమిదేవితో చెప్పాడు.

అక్కడికి వెళ్ళి యీ మాటలు సోమిదేవితో చెప్పే సరికి అతడిసంతోషం సగం చచ్చిపోయింది. సోమిదేవి నోరు నొక్కుకుంది. ఈ పెళ్ళి జరగటానికి ససేమిరా వీలులేదన్నది. ఆమెకు పూర్తిగా ఇష్టంలేకపోయింది. రామశాస్త్రిని తలచు కొన్నప్పుడల్లా ఆమెవొంటిమీద చీమలూ, జెర్రులూ ప్రాకి నట్లనిపిస్తుంది.

సూరినారాయణశాస్త్రి భార్యకు నచ్చచెప్పబోయి నాడు. కాని ఆమె ససేమిరా వినిపించుకోలేదు. వెళ్లి అత్తగా రితో యీ విషయాన్ని చిలవలూ, పలవలూ కల్పించి చెప్పింది. రామశాస్త్రిని సవాలక్షు తిట్టింది. సుబ్బమ్మగారు

భర్తతో ఈ విషయం మొరపెట్టుకుంది. సూరిశాస్త్రి నచ్చ చెప్పబోయినాడు ఆమెకూడా వొక్కటీ వినిపించుకోక పోయింది. తల్లి దగ్గరికి చంద్రశేఖరం వచ్చాడు.

చంద్రశేఖరం వచ్చి చెప్పాడు. సుబ్బమ్మగారు చంద్రశేఖరం చెప్పిందంతా విని శాంతించింది. అప్పుడు సోమిదేవి వొక్కతే వొక పక్షమైంది. సూరినారాయణశాస్త్రి తటస్థుడు.

సూరిశాస్త్రికీ, చంద్రశేఖరానికీ, సుబ్బమ్మగారికీ ఇష్టం కుదిరింది.

సరస్వతికి కూడా ఇష్టమే!

రామశాస్త్రికీ ఇష్టమే! సోమిదేవిమాటలకు విలువ లేక పోయింది. ఆమెకష్టాయిష్టాలతో ఎవరికీ పనిలేకపోయింది.

వైశాఖమాసంలో సరస్వతిపెండ్లి జరిగింది పెద్ద ఆడంబరాలు లేకపోయినా, కలిగినంతలో ఘనంగానే జరిగింది. అవాళ రామ్మూర్తిమావయ్యగారింటికెళ్ళి చంద్రశేఖరం పిలిచివచ్చాడు. వాళ్ళఇంట్లోవాళ్ళంతా వచ్చారు. సూరి నారాయణశాస్త్రి రామ్మూర్తిని చూడగానే ముఖం మటమట లాడించుకున్నాడు. పార్వతినిచూడగానే సరస్వతికి ప్రాణం లేచివచ్చినట్లయింది. రహస్యంగా ఎవరికీ కనపడకుండాకూచుని ఎన్నో మాట్లాడుకున్నారు. క్షణక్షణానికి సరస్వతిని వెతు క్కుంటూ ఎవరో వొకరు వచ్చేవాళ్లు. సరస్వతికి విసుగుపుట్టేది. పార్వతి నవ్వుకునేది. ఓసారి చంద్రశేఖరం వచ్చాడు.

"ఓహో పార్వతికూడా ఇక్కడే వుందే! ఏమేనా సలహాలిస్తున్నదా సరూ!" అన్నాడు చంద్రశేఖరం. పార్వతి తలవంచుకుంది.

"మాకేం తెలుస్తాయి, గంపలూ చట్టుబండలూ" అంది సరస్వతి తెచ్చిపెట్టుకున్న కోపంలో.

"మరి తెములూ! తలంట్లట, ఇంకా ఏవో, ఏవో. ప్రతివాళ్ళూ పెళ్ళికూతురు రేపని చెప్పుకుంటున్నారు" అన్నాడు చంద్రశేఖరం.

సరస్వతి అతడివేపు ఆశగా చూస్తూ "అన్నయ్యా! వొకటనేదా?" అన్నది.

"వందనవే సరూ, యీ మూడురోజులూ ఎన్నైనా అను. తర్వాత నువ్వు మీ అత్తారింటి కెళతావు. నువ్వు అనేదీ వుండదు. మేం వినేదీ వుండదు" అన్నాడు చంద్రశేఖరం.

సరస్వతిముఖంలో కళ తగ్గింది. ఎంత సంతోషమున్నా ఏమిటో స్వజనాన్ని, స్వపరివారాన్ని వదలివెళుతున్నానన్న బాధ ఆమెను విచలితురాల్ని చేసింది. ఎక్కడికో, ఎంత దూరానికో ప్రయాణం చేయవాల్సివచ్చినట్లూ, ఇక ఇన్నాళ్లూ తాను పెరిగిన పరిసరాలకు వీడ్కోలు చెప్పాల్సివచ్చినట్లూ, సరస్వతికి బాధకలిగింది కళకళలాడేముఖంలో, బుగ్గని కాటుక నల్లగా విచారాన్ని సూచిస్తున్నది. నిండు చంద్రుడిలో మచ్చలా, బుగ్గని ఆ మచ్చ శోభిల్లుతున్నది. ఇంత సంతోషం లోనూ, ఇన్నాళ్లు పెరిగిన పరిసరాలను వదిలిపోవాలన్న భయం వొక్కచోట గూడుకట్టుకున్నదేమో అన్నట్లుగా, ఆ మలిన మంతా బుగ్గమీద చుక్కరూపాన బయటపడుతున్నది.

"మరేం లేదు" అన్నది తెముల్చుకుని.

చంద్రశేఖరం చెల్లెలివేపు ఆప్యాయంగా చూశాడు.

"పార్వతిని నువ్వు పెళ్ళి చేసుకోకూడదూ!" అన్నది సరస్వతి.

సరస్వతి అలా అంటుందని పార్వతి వూహించుకోలేదు. చంద్రశేఖరం ఇల్లెక్కిపోయేలా నవ్వాడు. పార్వతి లజ్జావినమ్రురాలై "పో సరస్వతీ, నువ్వు చేసుకుంటున్నావుగా పెళ్ళి!" అన్నది.

సరస్వతి తమాషాగా నవ్వి పార్వతిబుగ్గమీద పొడుస్తూ "నువ్వూ పెళ్ళిచేసుకోవాలేం?" అన్నది

"ఉహూ" అన్నది పార్వతి సుతారంగా.

"అలా అని పార్వతి నాకు సిఫారుసుచెయ్యమందా సరూ?" అన్నాడు చంద్రశేఖరం.

సరస్వతి నవ్వింది.

పార్వతి కళ్ళలో కోపం తెచ్చిపెట్టుకుంది. కోపం ఆపుకోలేక పాపం నవ్వేసింది.

"సరే చేసుగుంటానులే" అన్నాడు చంద్రశేఖరం ఏదో ఉద్ధరించేవాడిధోరణిలో.

"నువ్వే సుఖపడతావు" అన్నది సరస్వతి.

సోమిదేవి వచ్చి సరస్వతిని పిలిచింది. సరస్వతివెనకాలే పార్వతి బయలుదేరింది.

పెళ్ళిమంటపంలోకూడా సరస్వతివెనకాలే కూచుంది. మధుపర్కం భుజంమీదనుండి పదేపదే జారిపోతుంటే సర్దటం పార్వతిపనైంది. వరుడు పుస్తెలతాడు బిగించేప్పుడు జడయెత్తి పట్టుకుంది. హోమగుండంముందు కూచున్నప్పుడు పొగ కళ్ళ

లోకిపోయి ఉక్కిరిబిక్కిరవుతుంటే వీవనతో విసిరింది. సరస్వతిని అంటుపెట్టుకునే తిరిగింది. మేజువాణీలో చెండ్లాడించటం, అగరువత్తులు ముట్టించటం, గంధాలుతీయటం, పేరంటాళ్ళకు బొట్లుపెట్టటం అన్నీ పార్వతే చేసింది. పాటలుకూడా పాడింది. పాడుతూ పాడుతూ ఎక్కడేనా చంద్రశేఖరం వున్నాడేమోనని చూసేది. అత డెక్కడో తనవేపే చూస్తూ కనపడేవాడు. వెంటనే సిగ్గుపడేది. ఎలుగురాపడేది. తలుపులదగ్గర పేర్లు చెప్పించటం, హారతులుపట్టటం, అన్నీ పార్వతికి ఉత్సాహజనకాలైనయ్.

అప్పగింతలపాట కూడా తానే పాడింది. సరస్వతి ఎంతో అందంగా కనిపించింది పార్వతికి. కౌగిలించుకోబుద్ధేసింది. తెల్లవారుఝామున పెళ్ళివారు బయలుదేరారు. పార్వతి నిద్ర పడదోసుకవస్తున్నా వచ్చి కూచుంది.

సరస్వతికనురెప్పలు బరువుగా కదలాడుతున్నాయి. మొగుడిమీద బుక్కాయిచల్లేప్పుడు సరస్వతిగాజులు చేసిన చప్పుడులో ప్రణయరహస్యాలు వినిపించాయి పార్వతికి. కోటి సౌందర్యాలు తపస్సుచేసి, ఆ బరువైన కనురెప్పలకింద దాక్కున్నాయి. కోటి తారకలకాంతులు ఆ కళ్ళ వెలుగు. కోటి నందనవనాల పరిమళం ఆమెన గుబాళింపు. కోటి కోర్కెల రాసిపోసుకున్నచూపు ఆమె భవిష్యత్తులో రేపు. ఆమె విచ్చిన గులాబిపువ్వు. అయితే అది అనాఘ్రాతం కాదు. ఎవరో వాసన చూశారు. సౌందర్యం అనుభవంలో పరిపూర్ణత నింపుకుంది.

సరస్వతి కనుకొలకుల్లో నీళ్లు నిలిచాయి. తాను పిళ్ళం

దరినీ విడిచిపోవాలి. అమ్మనూ, నాన్ననూ, పెద్దన్నయ్యనూ, చిన్నన్నయ్యనూ, వదిననూ, వేణుగోపాలస్వామినీ, పార్వతినీ, అందరినీ విడిచిపోవాలి. మళ్ళీ ఎప్పుడో ఎన్నాళ్ళకో వీళ్ళను కలుసుకోవటం. అప్పటికి ఎన్ని మార్పులో!

పార్వతిని కావిలించుకుంది. పార్వతికి మనసులో చెప్పలేని దిగులైంది. ఏమిటో చెప్పలేని బాధ. "మళ్ళీ పదిరోజుల్లో వస్తాను" అన్నది సరస్వతి. పార్వతి దిగులుగా నవ్వింది.

వెనకాల చంద్రశేఖరం నిల్చున్నాడు. అతణ్ణిచూసిన పార్వతికి మనసులో ఏవేవో చిత్రాలు కనిపించాయి. కాని అతడి కనుకొలకులలోనూ నీళ్లు అవి తుడుద్దామనుకుంది పార్వతి. కొంగు వేలికి చుట్టుకుని వొకడుగు ముందుకు వేసింది. ఇంతలోనే మేళాలు మ్రోగాయి. సరస్వతి పాలకీలో ఎక్కికూచుంది. పార్వతికి ఇంటికెళ్ళి పడుకుంటే తెల్లవారినదాకా నిద్రపట్టలేదు.

పార్వతి నిద్రలేచేసరికి పాలకీ తిరిగివచ్చింది. వాళ్లు రైల్లో వెళ్ళిపోయారట. పార్వతి ఎవరినో అడిగింది. చంద్రశేఖరం కూడా వెళ్ళాడుట. పార్వతికి సరస్వతి అత్తవారింటికెళ్ళటం ఏదో పోగొట్టుకున్నట్లనిపించింది.

రెండురోజుల తర్వాత చంద్రశేఖరం వచ్చాడు. "అక్కడ హాయిగా కులాసాగా వుంది సరూ" అని చెప్పాడు.

చంద్రశేఖరం ఇంటికొచ్చేసరికి తండ్రీ, సహోదరుడు పెళ్ళికయిన ఖర్చులో ఏ యే మొత్తం దేనికైందీ చూసుకుంటున్నారు. సోమిదేవికూడా మగడికి సాయపడుతోంది.

సూరినారాయణశాస్త్రి చాలా జాగ్రత్తగా లెక్కలు తయారుచేశాడు. సూరినారాయణశాస్త్రికి రెండువందలు ఖర్చయింది. ఆ రెండువందలగురించి అతడు మహా తాపత్రయ పడ్డాడు. సూరిశాస్త్రికి తలకుమించిన ఖర్చయింది. అతడేమాట చెప్పలేక బాధపడుతున్నాడు. చంద్రశేఖరం వచ్చి లెక్క సరి చూశాడు.

"రోజులు గడచినతర్వాత ఆ డబ్బు నేనిస్తానులే అన్నయ్యా" అన్నాడు చంద్రశేఖరం.

సూరినారాయణశాస్త్రికా మాటలే కొంత స్వాంతన కలుగచేసినయ్. సోమిదేవి బుగ్గలు నొక్కుకొంది. ఆ కాసేపు ఆ ఇంట్లో శాంతి, సుహృద్భావమూ, సామరస్యమూ నెల కొన్నాయి.

వారంరోజులు గడచినతర్వాత రామశాస్త్రిదగ్గర నుండి చంద్రశేఖరానికి ఉత్తరం వచ్చింది. ఆ ఉత్తరంచూచి చంద్రశేఖరం నవ్వుకున్నాడు. అందులో విశేషాలేం లేవు. కాని ఎన్నో విశేషాలు ధ్వనిస్తున్నాయి.

వైశాఖం వెళ్ళిపోవచ్చింది. పగలంతా మండిపోయే యెండకాసినా, సాయంకాలానికి వెదురుబద్దలవంతెనకింద పారే సన్నకాలవమీదినుండీ, వేపచెట్లమీదినుండీ గాలివీస్తూ రాత్రు ళ్ళను చల్లబరుస్తున్నది. వేపచెట్లు నిండా పూచి, వగరువాస నలు నింపుకుంటున్నాయి. వేణుగోపాలస్వామిఆలయ విమాన శిఖరంమీది పావురాళ్లు వుక్కకితట్టుకోలేక పల్లిటీలుకొడుతూ అరుస్తుంటాయి రోజూ. కాలవవెంబడే షికారుకెళ్ళితే సంధ్యవేళ ఇంటికి తిరిగివచ్చేప్పుడు ఏ తోటలోంచో విచ్చీవిచ్చని మల్లె

పూలవాసన చుట్టుకునేది చంద్రశేఖరాన్ని. కంచెంవెంబడి వంగి వసరుమొగ్గలు కోసుకునేవాడు. అవి వాసనలీనవు. దారివెంట రకరకాల పిచ్చిపూలు చూస్తూ ఇంటికి చేరుకునేవాడు.

రాత్రిళ్లు చంద్రశేఖరానికి సరిగా నిద్రపట్టదు. ఏదో ఆందోళన, ఏమిటో అశాంతి. నాలుగైదురోజుల్లో పరీక్షా ఫలితాలు తెలుస్తవి. తరువాత ఏంచెయ్యాలి? ఇంకా చదువు కునేందుకు ఆర్థికస్థితి బాగులేదు. ఎక్కడేనా వెంటనే ఉద్యోగం దొరకటం అసంభవం. ఏంచెయ్యాలి? అయినా పరీక్ష ఏమా తుందో! ఎప్పుడో తెల్లవారుఝామున కునుకుపట్టేది. ఆ కాసేపు ఏమిటో పిచ్చిపిచ్చి కలలు. ఆలయంలో గంటలు మోగుతవి. కళ్ళు నులుముకొని లేస్తాడు. అప్పటికే పొద్దెక్కు తుంది. మళ్ళీ మామూలు దినచర్య. అలానే రోజులు గడచి పోతున్నాయి.

## 6

జ్యేష్ఠమాసం వచ్చింది. వేణుగోపాలస్వామిఆలయంలో పెద్దయెత్తున ఉత్సవాలు జరపటానికి ఊళ్లోవాళ్లు సన్నాహాలు చేస్తున్నారు. ప్రతిసంవత్సరం స్వామికల్యాణం జరుగుతుంది జ్యేష్ఠమాసంలో. పది పదిహేనురోజులు రంగరంగ వైభ వాలతో స్వామి బిఱ్ఱబిగిసిపోతాడు. ఊరివాళ్ళతోపాటు ఆయ నకు ఉత్సాహం వస్తుంది. పట్టుపట్టి అందరిపద్దా చందాలు వసూలుచేస్తారు. ఊళ్లో కోలాహలం యెక్కువైంది. వీరయ్య శ్రేష్టి, కొడుకు లక్ష్మీకాంతం చందాపట్టీలు పట్టుక వీధివీధి తిరుగుతారు. సూరిశాస్త్రి యథాశక్తి పాల్గొంటాడు. సూరి

నారాయణశాస్త్రి సోమిదేవితో సంప్రదించి స్వామిఉత్సవాల నిమిత్తం రెండురూపాయలు చెల్లించాడు. సూరినారాయణ శాస్త్రి స్వామికి చందాఇస్తూ మొక్కుకున్నాడు. ఈ సంవత్సరం స్కూళ్ళఇన్స్పెక్టరు పెద్ద రిమార్కులు వ్రాయకుంటే చాలును అతడికి. అంతకంటె ఏమీ కోరుకోడు. ప్రతిసంవత్సరం ఇలానే కోరుకుంటాడు. వాళ్ళ జీవితాలే అంత వాళ్ళని తలపట్టనన్ని సమస్యలు బాధించవు. వీరయ్యశ్రేష్ఠి బాగాలాభం రావాలని కోరుకుంటాడు. పెద్దకాపుకి చేలు బాగా పండాలి. ఇదే పల్లెప్రజల కోరిక. వాళ్లు అంతకన్నా ఇంకేం కోరుకోరు.

సోమిదేవి మనసులోనే ఏదో కోరుకుని దేవుడికి ముడుపు కట్టుకుంది. ఆమె మనసంతా ఏదో మధురిమ నిండినట్లనిపించింది. భర్తకేసి స్నిగ్ధదృష్టిబరపింది. ఆమెహృదిలో బాలకృష్ణుని కాలి గజ్జెలచప్పుడు ధ్వనించింది. వాళ్ళ పడకగదిలో గూట్లో బాలకృష్ణుడున్నాడు. చక్కగా అంబాడుతూ వుంటాడు. బాలకృష్ణుడిని వాత్సల్యంతో దగ్గరకు తీసుకుని పాలుగుడుపుతున్న యశోద గోచరించింది సోమిదేవికి. ఆమె కనులు భక్తిభావంతో చెమర్చాయి. మరోసారి స్వామి కామె మొక్కుకుంది. సూరిశాస్త్రి నిర్లిప్తంగా వుండిపోయాడు. మనసులో దేనినిగూర్చీ భగవంతుణ్ణి ప్రార్థించలేదాయన. ఆయనకు తెలుసు, భగవంతుణ్ణి యీ సంసారబంధాల్లో పడి, కేవలం చిన్నచిన్న కోరికలతో ప్రార్థించరాదని. ఈమధ్య ఆయనకు ఆధ్యాత్మికచింతన యెక్కువైంది. ఇదివరలోనైతే ఎప్పుడూ సరస్వతిపెళ్ళిగురించే ఆయనకు చిత్తశాంతి కరవ

య్యేది. కాని ఇప్పు డాయనమనసు ప్రశాంతంగా వుంది. ఈ ఐహికచింతల నన్నిటినీ వదిలేద్దామని ప్రయత్నిస్తున్నాడు. సుబ్బమ్మగారుమాత్రం చిన్నకొడుకుపెళ్ళి, ఉద్యోగం, సంసారం, ఇవన్నీ సక్రమంగా వుండాలని స్వామిసన్నిధిలో కోరుకునేది. చంద్రశేఖరానికెప్పుడూ గుడికివెళ్ళే అలవాటు లేదు. చిన్నప్పుడు దేవగన్నేరుపూలు కోసుకొచ్చుకోటానికి వెళ్లేవాడు. పెద్దవాడయ్యేకొద్దీ భక్తిభావం నశించింది. యువ్వనంలో పరిణామవాదంయొక్క సిద్ధాంతాలు అతడిని బాగా ఆకర్షించాయి. భగవంతుడు, కర్మ, అదృష్టం, దురదృష్టం, ఐహికచింతన—వీటిగూర్చి అతడి కెన్నడూ చింత కలుగలేదు. ఏమిటో ఆలోచించినకొద్దీ తెగనిసమస్య లవి. అందుకని ఆలోచించడమే కూడదనుకునేవా డతను.

గుడిలోపలా, బయటా గోడలు బాగుచేసి సున్నం కొట్టారు. బయట గోడలనిండా అంచంగా సున్నమూ, యెఱ్ఱమన్నూ పట్టెలు తీర్చారు. తాటాకులతో చిన్న పందిరి వేశారు. అన్నిహంగులూ సమకూర్చారు. దేవుడిపెళ్ళి!

ప్రతిసంవత్సరం సరస్వతి పనిగట్టుకుని వెళ్ళి గుడినిండా పసుపుకుంకాలుపెట్టి వచ్చేది. సుబ్బమ్మగారు కూతురిని ఎంతగానో తలుచుకుంది. సూర్యశాస్త్రి అల్లుడికి ఉత్తరంకూడా వ్రాశాడు, కూతురిని పదిరోజులపాటు పంపించమని.

ఈ సంవత్సరం గుళ్లో పసుపూ కుంకాలు అలంకరించటం పార్వతిపనైంది. ఇంకా తోటివాళ్లు వచ్చి సాయంచేసేవాళ్లు. ప్రతిరోజూ ఆలయంలోని తులసివనంనుండి తులసీదళాలు

కోసుకవచ్చి స్వామికి పెద్దపెద్ద మాలలు గుచ్చాలి. తులసి పేరులంటే స్వామికి ఎంతో ఇష్టం.

పార్వతికి వాళ్ళమ్మ ఆ కథ ఎంతో చిన్నప్పుడే చెప్పింది. స్వామికి తులసిఅంటే అంత ఇష్టం ఎందుకో! ఓసారి వేణు గోపాలస్వామిఆలయంలోనే తులసిని గురించిన హరికథకూడా విన్నది పార్వతి. ప్రదక్షిణాలుచేస్తూ తల్లి పాడేపాట తనకూ వచ్చును. పార్వతికి తులసికోటలేని ఇల్లు ఇల్లే కాదనీ తెలుసు.

"ఐదవప్రదక్షిణము, ముదిత నీ కిత్తు
ఐదవతనమ్మును నా కియ్యవమ్మా"

అని వొకొక్క ప్రదక్షిణమేచేస్తూ తల్లి పాటపాడటం పార్వతి చాలాసార్లు విన్నది. తులసిపేరులో నడుమ నడుమ మాచిపత్రీ, చామంతాకులూ, దవనమూ కలిపి కట్టేది. మల్లెపూలు విశే షించి దొరకటంలేదు వైశాఖం వెళ్ళిపోయింది. తోటల్లో ఎక్కడో కాసిన్ని దొరుకుతున్నాయి. అన్నీ స్వామికే.

స్వామికి మాలలుగుచ్చుతున్నానన్న భావం పార్వతికి ఎంతో ఆనందాన్నిచ్చేది. పెద్దపెద్ద మాలలు స్వామిమెడలో వేలాడుతుంటే పార్వతికి గర్వంగా వుండేది. స్వామిని తానే అలంకరించినట్లు ఆలయంలో ఉత్సవాలు ప్రారంభమైనాయి. ఉపన్యాసాలు జరుగుతున్నాయి. చాలామంది పండితులు వచ్చారు. గాయకులు వచ్చారు. ఓరోజు పాటకచ్చేరికూడా జరిగింది. ఓరోజున చంద్రశేఖరం గుడికి వెళ్లాడు. గుళ్లో పార్వతి కన్పించింది. కల్యాణమంటపంలో కాసేపు కూచుని వచ్చేశాడు చంద్రశేఖరం. మర్రోజునే రామశాస్త్రినుండి ఉత్తరంవచ్చింది. ఆ ఉత్తరం చూడటంతోటే చంద్రశేఖరానికి నవనాడులూ

క్రుంగిపోయినయ్. ఏమీ తోచలేదు. బాధతో కూలబడి పోయాడు. ఇంట్లో అంతా మామూలుగానే వున్నారు. ఆ ఉత్తరం ఇంగ్లీషులో వ్రాశాడు రామశాస్త్రి. అందుకని అందు లోనివిషయం ఎవరికీ తెలీలేదు.

రామశాస్త్రి పరీక్ష ప్యాసైనాడట. చంద్రశేఖరం పరీక్ష తప్పాడు. రామశాస్త్రి ఆ శుభవార్త వ్రాశాడు. అదే ఉత్త రంలో క్రింద సరస్వతి రెండుమూడు వాక్యాలు వ్రాసింది. అమ్మా నాన్నకి, అన్నయ్యలకీ నమస్కారాలనీ, వదిననూ, పార్వతిని అడిగానని చెప్పాలిసిందనీ, దేవుడిపెళ్లికి రాలేక పోతున్నందుకు విచారపడుతున్నాననీ వ్రాసింది. చివర వో వాక్యం కలిపింది, ఆయన పరీక్షఅయినారని. ఈ శుభవార్తను ఇంట్లో ఎవరికి ఎలా తెలియచెయ్యాలో అర్థంకాలేదు చంద్ర శేఖరానికి. ఇంట్లో వుండలేకపోయాడు. పరీక్షతప్పటం ఏమంత ఘోరమైనవిషయం కాదు. కుటుంబపరిస్థితులు, ఆర్థికకష్టాలు, భవిష్యత్తులో చిక్కుదార్లు తలుచుక భయపడ్డాడు చంద్రశేఖరం. ఇంట్లో కూచోలేకపోయాడు. బయలుదేరి వెదురుబద్దలవంతెన దగ్గరికి చేరాడు. దారిలో కనపడ్డ ప్రతివ్యక్తినీ పరిశీలించాడు. ఆడా మగా, పిల్లా పాపా అందరినీ వింతగా చూశాడు. ప్రతి వాళ్ళు సమస్యలేలేనట్లు, సంతోషంతోసాగిపోతున్నారు. ఎంతో ఉత్సాహం, ఆనందంతో సాగుతున్నారు. నిజంగా వాళ్ళు అంత సుఖశాంతులతో లేకపోయినా చంద్రశేఖరానికి అలా అనిపిం చింది వాళ్ళను చూస్తూంటే. ప్రపంచమంతా, ఆనందమయం గానే వుంది. ప్రతివాళ్లూ అతిశయంతో ముందుకు సాగుతూనే

వున్నారు. తనకే కష్టాలు, తనకాళ్లు విరిగిపోయాయి అనిపించింది
చంద్రశేఖరానికి. నాలుగుబజార్లుకలుసుకునే మఱ్ఱిచెట్టు మొగ
దల ఆర్యవైశ్య కాఫీక్లబ్ వెలసింది. అందులోకి వెళ్ళి కూచు
న్నాడు చంద్రశేఖరం హోటలుయజమాని తెల్లబోయ్యాడు.
అయినా లోకం మారుతోంది! తనకెందుకూ ఈ ఆశ్చర్యం
అని అనుకున్నాడు ఓ కుఱ్ఱాడొచ్చి అడిగాడు ఏం కావాలని.
చంద్రశేఖరం ఏమీ వద్దన్నాడు. హోటలుయజమానిఆశ్చ
ర్యం తగ్గిపోయింది. సూరిశాస్త్రిగారబ్బాయి తన హోటల్లో
ఇడ్డెన్లు, ఉపమా తిందామని వచ్చాడు, పట్నంలో భోజనం
హోటలేగా అనుకున్నాడు మొదట. ఇప్పుడు కాదనుకున్నాడు.
బల్లమీద ఎప్పటిదో రెండుమూడురోజులనాటి దినపత్రిక
కన్పించింది. చంద్రశేఖరం చూశాడు. ఫలానిచోట విద్యార్థులు
సమ్మెచేశారు. ఫలానిఊళ్లో గొలుసులాగి రైలాపారు. ఇంకె
క్కడో బౌద్ధకాలంనాటి నాణేలు దొరికాయి. ఫలాని సినిమా
త్వరలో విడుదలవబోతున్నది. బంగారం, వెండీ, మిర్చి, వంటా
ముదం రేట్లు, రెండురోజులక్రిందట విశేషాలు అన్నీ. చంద్ర
శేఖరం లేచిపోయినాడు. ఓ కిరాణాకొట్టుదగ్గర ఆగి వో పెట్టె
సిగరెట్లు తీసుకున్నాడు. వెదురుబద్దలవంతెనమీద నడుస్తుండగా
అమాంతము అది విరిగి కాలువలో దూకితే బావుండుననిపించిం
దతడికి. ఎవరిమీదనో కోపం, పగ. అందుకని వాళ్ళను సాధించ
టానికి తాను పూర్తిగా చెడిపోతే అన్నభావం కలిగి పెరిగింది
అతడిలో కొద్దిక్షణాలక్రిందనే. కాని కాలవలో నీళ్ళులేవు. గులక
రాళ్లూ, ఇసుకా, సన్నగా ఎక్కడో కాస్తనీళ్ళజాలు. వెదురుబద్దల
వంతెనదాటి కాలువవెంబడే నడిచాడు చంద్రశేఖరం. చాల

దూరం నడిచాడు తాటిచెట్లదాకా. అక్కడే సరిగచెట్లున్నాయి పోయి లోపల కూచున్నాడు. సిగరెట్ వెలిగించుకున్నాడు. అతడిమనసంతా ఆందోళనగావుంది అప్పుడేగాలికాస్తచల్లబడ్డది. దూరంగా ఆలయంలోంచి గంటలు వినపడుతున్నాయి. ఎక్కడినుంచో పేరు తెలీనిపక్షి అరుస్తున్నది సిగరెట్టుమీద సిగరెట్టు అంటించాడు. ఎంత ఆలోచించినా ముందు ఏంచెయ్యాలి అన్న విషయం తెలీలేదు. చీకటిపడబోతుండగా లేచాడు. వెదురుబద్దల వంతెన దాటుతుండగా అతనికి అత్యాశ్చర్యకరమైన సంఘటన ఎదురొచ్చింది. ఎదురుగా వో అందమైన అమ్మాయి నడచివస్తున్నదివంతెనమీద.ఆఅమ్మాయిఆకృతి నాగరీకంగా కనిపిస్తున్నది. చంద్రశేఖరం ఆశ్చర్యపోయినాడు. ఆ అమ్మాయి అతడివేపు పరీక్షగా చూసింది. దాటుకుని వెళ్ళిపోయింది. వంతెన దాటగానే వో ముసలినౌకరు కన్పించాడు. అతడు ఆ అమ్మాయి నౌకరై యుండవచ్చు ననుకున్నాడు చంద్రశేఖరం. అతడికి చిత్రంగా ఉంది. ఇలాటి పల్లెటూళ్లో అలాటి అమ్మాయి ఎలా పడ్డాదా అనేదే అతని కాశ్చర్యకరమైంది. కాసేపు వెనుదిరిగి చూశాడు వాళ్లు అకుమళ్ళతోటలవేపుగా తిరిగారు. చంద్రశేఖరం ఊరివేపు తిరిగాడు. అవాళంతా అతడిమనసు చాలా అలసిపోయింది ఆరాత్రి అతడికి సరిగా నిద్రపట్టలేదు.

మర్రోజు ఆ విషయం తండ్రితో చెప్పాడు చంద్రశేఖరం. పాపం ఆయనముఖం వెలవెల బోయింది. చంద్రశేఖరం అక్కడ వుండలేకపోయినాడు. ఎక్కడికి వెళ్ళడానికి తోచలేదు. వెళ్ళి మర్రిచెట్టుదగ్గర కాఫీహోటల్లో కూచున్నాడు. కాస్తంతదూరాన పంచాయితీబోర్డువారి ఆఫీసులోంచి రేడియో

కీచుగొంతుతో పాడుతున్నది. పుల్లయ్యచౌదరిగారి అరుగు మీద కుక్కలు చేరి గోలగోలగా అరుస్తున్నాయి. ఎన్నాళ్టి నాటిదో పాతరికార్డు గ్రామఫోనుమీద పాడిస్తున్నాడు హోటలు యజమాని. చంద్రశేఖరం 'పేపరేదీ?' అని అడిగాడు. నల్లటికుఱ్ఱాడొచ్చి 'ఏం కావాలి?' అని అడిగాడు. కాఫీ తీసుక రమ్మన్నాడు చంద్రశేఖరం. హోటలుయజమాని గ్రామఫోనుకి కీఇవ్వటంకూడా మరచిపోయి కుఱ్ఱాడిదగ్గరికి పరిగెత్తాడు. కాఫీలో కాసిని మంచిపాలు పొయ్యమని చెప్పాడు. పాతాళభైరవిలోరికార్డు పాడి ఆపేసింది గ్రామఫోను. హోటలుయజమాని పరిగెత్తుకుంటూ వచ్చాడు. కుఱ్ఱాడు కాఫీ తీసుకొచ్చాడు. చంద్రశేఖరానికి కాఫీ రుచించలేదు. నిండా పాలున్నాయి. అంతా పాలవాసనే. డికాషన్ పట్టుకరమ్మన్నాడు కుఱ్ఱాణ్ణి. వాడికి అర్థంకాలేదు. చంద్రశేఖరం తననీ, హోటలుయజమానినీ తిట్టుకుంటూ కాఫీ తాగాడు. లోపలికి మాలపంతులు వచ్చాడు. హోటలుయజమానికి ఎట్లయినా కాస్త కష్టమనిపించింది. చంద్రశేఖరం అక్కడే వున్నాడాయిరి. మాలపంతులు చంద్రశేఖరాన్ని పలుకరించాడు. "మీరు సూరినారాయణశాస్త్రిగారితమ్ముళ్ళు కదండీ?" అన్నాడు.

అవునన్నాడు చంద్రశేఖరం.

పంతులు కాఫీ తెమ్మన్నాడు. కుఱ్ఱాడు తెచ్చి దూరంగా పెట్టాడు.

చంద్రశేఖరం "పొద్దుపోవటంలేదండీ అసలు" అన్నాడు.

"మీరు పుస్తకాలు చదువుతారా?" అన్నాడు పంతులు. చంద్రశేఖరానికి ప్రాణం లేచివచ్చింది. పంతులు

చెప్పాడు. "అరవిందుడివీ, రామకృష్ణ పరమహంసవీ పుస్తకా లున్నవి. అయితే అవి తెలుగులోనే వున్నాయి."

"నవలలేం లేవూ?" అన్నాడు చంద్రశేఖరం.

పంతులు నవ్వాడు భావగర్భితంగా.

చంద్రశేఖరానికి అతనెందుకు నవ్వాడో తెలియదు.

"మేరీదగ్గర వున్నవి" అన్నాడు పంతులు.

చంద్రశేఖరం తెల్లబోయినాడు.

పంతులు చెప్పాడు. "నా భార్యకు విపరీతమైన పుస్త కాలపిచ్చి. శరత్ బాబు నవలలూ, బాపిరాజుగారివీ, యెంకి పాటలూ, చలంగారిపుస్తకాలూ వున్నాయి ఆమె దగ్గర" అన్నాడు.

చంద్రశేఖరానికి ప్రాణం లేచివచ్చింది. మేరీ, మేరీ అని గుణించుకున్నాడు. పంతులు ఎంత అదృష్టవంతుడు! నిన్న తాను వంతెనవద్ద చూసింది, ఆమెను కాదు కదా! అనుకున్నాడు చంద్రశేఖరం.

"ఊవూళ్లో అంతా మరియమ్మ అంటారు. మేరీ అంటే తెలీదు" పంతులు నవ్వాడు స్వచ్ఛంగా. చంద్రశేఖరం లేచి ఇంటిదారిపట్టాడు.

ఆలయంలో గంటలు మోగుతున్నాయి.

దారిలో పార్వతి కన్పించింది.

చేతిలో పూలసెజ్జ వుంది. దాన్నిండా పూలమాల లున్నాయి. చెవిలో తులసీదళం వుంది.

చంద్రశేఖరం పలుకరించాడు.

"ఓ మహాభక్తురాలా, అన్నట్లు నేటి ప్రసాదం పులిహోరా, చక్రపొంగలా?" అన్నాడు పార్వతి ప్రసాదంకోసమే పోతున్నదని అపహాస్యంచేస్తూ.

పార్వతి నవ్వింది. కనుబొమలు కుంచించి "మరే, శనగలు" అంది.

"అయితే నేనూ వస్తాను" అన్నాడు చంద్రశేఖరం.

"రాకూడదూ!" అంది పార్వతి.

చంద్రశేఖరం పార్వతి వెనకాలే బయలుదేరాడు. దారిలో వాకరిద్దరు చిన్ననాటి సహాధ్యాయులు కన్పించారు. తక్కినవాళ్లు వింతగా చూశారు. పార్వతి అసలేమీ పట్టించుకోనట్లే ముందుకు సాగిపోతోంది. చంద్రశేఖరం ఆలయంలో అడుగుపెట్టాడు.

ఆలయంలో అతడికి తల్లీ వదినా కన్పించారు. ఓపక్కగా చిన్నచిన్న పిల్లలంతా కలిసి భజనచేస్తున్నారు. ఓ పక్క పెద్దవాళ్ళు వేదాంతం చర్చిస్తున్నారు. పార్వతికోసం చూశాడు చంద్రశేఖరం. పార్వతి ఎక్కడ మాయమైందో మాయమైంది. కాసేపు అక్కడే కూచుని గర్భగుడిలోకి వెళ్ళాడు చంద్రశేఖరం. స్వామిని చూశాడు. స్వామికళ్ళు నవ్వుతున్నాయి.

చంద్రశేఖరం వెనక్కు తిరిగాడు. మధ్యాహ్నం ఇంట్లో అన్న తనవేపు అదోరకంగా చూడటం గమనించాడు చంద్రశేఖరం. తండ్రి ఏదో దిగులుగా వున్నట్లు కనిపెట్టాడు. అయినా ఇటువంటి చిన్నచిన్న విషయాలని లెఖ్ఖచెయ్యదలచుకోలేదతడు.

సాయంకాలానికి ఆలయంలో ఎవరో పాడతారని తల్లి చెప్పింది. అత డాలయానికి వెళ్ళాడు.

## 7

చంద్రశేఖరం యీమధ్య జీవితసమస్యలను గురించి విపరీతంగా ఆలోచించడం మొదలెట్టాడు. అతడు వొక సంధి కాలంలో జీవిస్తున్నాడు యవ్వనం, మానసికసంఘర్షణ, నిత్యవినీతుల తారతమ్య చర్చ, ఆదర్శాలు, భవిష్యత్తూ, ఒక టేమిటి అన్నీ అతణ్ణి క్రుంగదీస్తున్నాయి. ఏం చెయ్యటానికీ తోచదు. ప్రొద్దున్నే లేవటం, కాలకృత్యాలు. ఇక అప్పటి నుంచి ఒక్కొక్కక్షణం ఎంతో బరువుగా వెళ్ళిపోతున్నట్లని పిస్తుంది. ఏమీ తోచదు.

రాత్రిళ్ళు నిద్రపట్టదు. ఒకటే ఆలోచనలు.

మళ్ళీ పగలు. మళ్ళీ రాత్రి.

ఈమధ్య చంద్రశేఖరం ప్రతిరోజూ గుడికి వెళుతు న్నాడు. మానసికశాంతికోసం. అక్కడి వేదాంతచర్చల లోనూ, భజనగీతాలలోనూ, పరమార్థచింతనలతోనూ, మానసికసంఘర్షణ వదుల్చుకుందామని ప్రయత్నిస్తున్నాడు. రెండుచేతులూ జోడించి దండంపెడుతున్నాడు స్వామికి. కాని అతడికి చిత్తశాంతి లభించటంలేదు. భక్తిగీతాలు కాని, భగ వద్దర్శనం కాని అతడి తాపాన్ని ఉపశమింపచేయలేక పోతున్నాయి. అతడు ప్రతిరోజూ కోరుకుంటాడు స్వామిని చిత్తశాంతిని ప్రసాదించమని. చిత్తశాంతి లభ్యమైతే ఇంకేమీ అక్కర్లేదట చంద్రశేఖరానికి. వెఱ్ఱివాడు. చిత్తశాంతి అనేది అందరికీ లభించేదికాదు. వారివారి మానసిక దారుఢ్యం

మీద ఆధారపడివుంటుంది.

ఒకరోజు ఇంట్లో ఏమీతోచక స్వామికి పూలమాల రచించాడు చంద్రశేఖరం. తల్లి చేతి కిచ్చాడు. తల్లి గుడికి తీసుకునివెళ్ళింది.

ఆవాళ చంద్రశేఖరం స్వామివేపు పరీక్షగా చూశాడు. స్వామికనులు నవ్వుతున్నట్లనిపించాయి చంద్రశేఖరానికి. ఆవాళ ఆలయంలో అందరికీ చంద్రశేఖరాన్ని ప్రసాదం పంచమన్నారు. ప్రసాదంపళ్లెం చంద్రశేఖరం తీసుకున్నాడు. అందరికీ పంచాడు. ఇక లోపలికి వెళ్ళబోతున్నాడు. ఇంతలో వో యువతి వచ్చింది. చంద్రశేఖరం యాంత్రికంగా ఆగిపోయ్యాడు. ఈ అమ్మాయినిగురించి నాలుగురోజుల్కితమే తెలుసుకోవాలని కుతూహలం కలిగిందతడికి. అసలు మొదట వెదురుబద్దల వంతెనవద్ద కనిపించినప్పుడే చంద్రశేఖరం ఆ అమ్మాయిని గురించి తెలుసుకోవాలనుకున్నాడు. తర్వాత మరచిపోయినాడు. మళ్ళీ నాలుగురోజుల్కితం ఆలయంలో ఆ అమ్మాయి తియ్యటిగొంతుకతో స్వామిమీద పాటలుపాడింది.

ముగ్ధమధురమోహనంగా పాటలు పాడింది. ఆవాళే తెలుసుకుందామనుకుని ఉత్సహించాడు. పరిస్థితివుంటే ఎప్పుడో తెలిసివుండును. తాను ఎవరిని అడగాలి? తెలీక ఊరుకున్నాడు. ఇవాళ ఆ అమ్మాయే తనముందర దోసిలివిప్పుకుని నిలబడింది. కావాలనే చంద్రశేఖరం ఆ అమ్మాయిచేతుల్లో ప్రసాదం వుంచటానికి ఒకక్షణం ఆలస్యంచేశాడు. ఆ అమ్మాయి నవ్వింది.

"నేను గుర్తులేనుకదూ?" అంది.

చంద్రశేఖరానికి చాలా ఆశ్చర్యమైంది.

ఒక్కసారి ఆ అమ్మాయి ముఖంలోకి చూశాడు.

అతడికేదో స్ఫురించినట్లయింది.

"అవును, చాలాకాలం అయిందికదూ చూసి, అందుకని గుర్తులేదు" అన్నది.

"నువు రాధవా?"

రాధ గలగల నవ్వింది.

చంద్రశేఖరం పోల్చుకోగలిగాడు. ఎప్పుడో ఏడెనిమిదేళ్ళప్పుడు చూశాడు రాధని.

ఇప్పుడు పదిహేడు, పద్దెనిమిదేళ్ళుండవచ్చు. పదేళ్ళు గడచిపోయింది. పదేళ్ళంటే సామాన్యమా? కాలచక్రంలో పదేళ్ళకు ఎన్నో విశేషాలు దొర్లిపుంటాయి.

రాధ అడిగింది:

"నేను నిన్ను పోల్చుకున్నానుగదా! నువు నన్నెందుకు పోల్చుకోలేకపోయావు?"

చంద్రశేఖరం నవ్వాడు.

ఇంటికి వెళ్ళినతర్వాత ఆ ప్రశ్నగురించే ఆలోచించాడు. ఎంతకూ సమాధానం దొరకలేదు.

కాని అతడిఆశ్చర్యానికంతులేదు రాధని చూసినప్పటినుంచీ. ఎంతమార్పువచ్చింది! అనుకున్నాడు.

అతడికి లీలగా బాల్యస్మృతులు గుర్తుకువచ్చాయి. పలకా బలపాలూ, వీధిబడీ, చిన్న చిన్న పిల్లవాళ్ళూ, రాధా, తానూ, క్రిందితరగతిలో సరస్వతీ, పార్వతీ, అంతా గుర్తొచ్చారు. రాధావాళ్ళింటికి రోజూ వెళ్ళేవాడు తాను. ఒకసారి అమ్మ కోపంచేసింది వాళ్ళింటికి వెళ్ళవద్దని. అయినా తాను

రెండోసారి వెళ్ళాడు. అమ్మ దండించింది. అయినా తాను అక్కడికి వెళ్ళడం మానుకోలేదు సరస్వతిమాత్రం వచ్చేది కాదు. తనకు చిన్నప్పుడు రాధంటే చాల ఇష్టం. ముఖ్యంగా వాళ్ళింటికెళ్ళినప్పుడల్లా తింటానికేదో ఇస్తుండేది రాధవాళ్ళమ్మ. అటువంటి రాధవాళ్ళమ్మను అమ్మ "వొట్టి పాడుమనిషి" అని అంటుండేది. తర్వాత ఒకరోజు ఆ మేడలోనివాళ్లు ఎక్కడికో వెళ్లిపోయ్యారు. మొదటమొదట తనకు దిగులైంది. క్రమంగా మరచిపోయినాడు. కొన్నాళ్లు వాళ్లు మళ్లీ వస్తారని ఆశించాడు. కాని వాళ్లు రాలేదు. మళ్ళీ రాధనుచూడటం ఇప్పుడే చంద్రశేఖరానికి. ఇన్నాళ్ళనుంచీ ఏమైనారో కనుక్కోవాలని ఉత్సుకతకలిగిం దతడికి. కాని రాధను ఎలా పలకరించాలి. ఇదివరకటి రాధ కాదుకదా! తాను ఇవన్నీ అడిగితే ఏమనుకుంటుందో! అయినా చంద్రశేఖరం అడగటానికి సాహసించలేదు.

మర్రోజు ఆలయానికి ముందుగానే వెళ్ళాడు చంద్రశేఖరం. పార్వతి కన్పించింది. కాని చంద్రశేఖరంకళ్ళు ఎవరికోసమో వెతికాయి. రాధ హారికథసగంలో వచ్చింది. చంద్రశేఖరం చూశాడు. అతడికిఆరాటం తీరినట్లనిపించింది.

అవాళకూడా రాధ పాటలు పాడింది.

చంద్రశేఖరంమనసును మధురిమలు అలుముకున్నాయి. రాధ "తరంగం" పాడింది. దానితో చంద్రశేఖరంహృదయం కూడా తరంగాలతో ఉదధివలె ఉప్పొంగింది.

రాధతో మాటాడదామనీ, చిన్ననాటి సంగతులు చెప్పుకుందామనీ అతడి కెంతో అనిపించింది. కాని రాధతో ఎలా మాటాడాలో తెలియలేదు. అవకాశం దొరక్కపోవచ్చు.

ఏమిటో వయస్సుపెరిగిన కొద్దీ స్నేహం తగ్గి, వేరువేరు ఆకర్ష ణాలు ఎక్కువవుతవి. వెనుకటి చనువూ, వెనుకటి స్నేహ భావమూ రాధయెడల ప్రదర్శిస్తే రాధ యేమైనా అనుకుంటుం దేమో? తనమనసు ఇలా ఆలోచిస్తున్న దేం? ముందు తనమన సుకి తా నేం సంజాయిషీ చెప్పుకోగలుగుతాడు?

రాధ స్వామిదగ్గరగా కూచుని పాడుతున్నది. ఇవతల కళ్యాణమంటపంలో స్తంభానికి ఆనుకుని కూచున్నాడు చంద్ర శేఖరం. ఈవలవైపున విరగబూచిన దేవగన్నేరుచెట్లమీద నుంచి చల్లటిగాలి వస్తున్నది. అటువైపు చిన్నపిల్లలు అక్కడే రెండుగుంతలు తవ్వి గోలీకాయ లాడుతున్నారు. చంద్రశేఖరం చూశాడు. హరికేన్‌లాంతర్లముందూ, గ్యాస్‌లైట్లముందూ గుడి దేదీప్యమానంగా ప్రకాశిస్తున్నది. అవతల హరిదాసు సగంలో ఆపి అలుపుతీర్చుకుంటున్నాడు. ఈ లోపున రాధని పాటలు పాడమన్నారు. రాధను ఎవరేనా పాడమని అడిగిందే తడవుగా పాడుతుంది. గోలీలాడుకునే కుర్రకారుని ఎవరో పెద్ద మనిషి వచ్చి తోలేశాడు.

రాధగొంతు, ఉద్గాతృలహోగలలాగా అక్కడున్న అందరినీ చుట్టుకొంటున్నది. అలుపులేదు. సొలుపులేదు. ఆ యా వృత్తులలో ఆమె వారిని ఏ దివ్యలోకాలకో తరలించుక పోతున్నది.

చంద్రశేఖరం చూశాడు. ఆమె యెదురుగా కన్పించ టంలేదు. కంఠపార్శ్వమూ, చెంపా, ముంగురులూ కన్పిస్తు న్నాయి. లైటుకాంతికి ముఖం వెలిగిపోతున్నది. చంద్రశేఖరం చూపులు మరల్చుకోలేకపోయాడు.

రాధ పాట ఆపేసింది.

చంద్రశేఖరం ఇంకోవేపుకి తిరిగిచూశాడు. దూరంగా ఆడవాళ్ళలో కూచుని పార్వతి తనవేపే తదేకంగా చూడటం గమనించాడు.చంద్రశేఖరానికి తనమీద జాలికలిగింది. అక్కడ నుంచి లేచి ఇంటికి బయలుదేరాడు. గుడిదాటి పదడుగులు నడిచాడో లేదో సుబ్బారాయుడు కన్పించాడు. మల్లువంచే, సిల్కుచొక్కా వేసుకుని వస్తున్నాడు హడావుడిగా. చంద్రశేఖరాన్ని చూసి ఆగిపొయ్యాడు. "ఏం విశేషాలు? అప్పుడే ఇంటికెళుతున్నావే?" అని పలకరించాడు.

"మనసు బాగులేదు" అన్నాడు చంద్రశేఖరం.

సుబ్బారాయుడు అసహ్యంగా నవ్వాడు. కాసేపు ఆలోచించి "ఏం, రాధగాని కన్పించిందా..." అన్నాడు.

తర్వాత ఏం మాట్లాడటానికి సుబ్బారాయుడికి తోచలేదు.

చంద్రశేఖరం అసహ్యంతో కుంచించుకపోయినాడు. "గుళ్లో వుంది పాటలుపాడుతూ" అన్నాడు. సుబ్బారాయుడు దగ్గరకుజరిగి రహస్యం చెపుతున్నవాడిలా "రాధ పాడటమే కాదు, ఆడుతుంది కూడా" అన్నాడు.

చంద్రశేఖరానికి ఆశ్చర్యమైంది.

"నువ్వెప్పుడు చూశావు?"

"నాకు తెలీదాయేం. వాళ్ళమ్మ బాగా నాట్యం చేసేదట. మా అమ్మకి తెలుసు. కొన్నాళ్లు మా అయ్య...దాని చుట్టూ...తిరిగి వ్యాపారంలో నష్టపడ్డాడు" సుబ్బారాయుడు చెప్పుకపోతున్నాడు.

చంద్రశేఖరానికి వింతామనిపించింది. కాని సుబ్బారాయుడు శిష్టజనసమ్మతంగా మాట్లాడటంలేదు. హావభావ విలాసాలతో ఏవేవో చెబుతున్నాడు.

"సరే వెళ్లు" అన్నాడు చంద్రశేఖరం. గుళ్లో మళ్లీ హరికథ ప్రారంభమైంది.

"నువ్వుకూడా రా" అని సుబ్బారాయుడు చెయ్యిపట్టుకున్నాడు. "నేను రానులే" అన్నాడు చంద్రశేఖరం. ఇంతలో దూరంగా ఎవరో స్త్రీమూర్తి తమవేపుగా రావటం గమనించారు. ఆమె దగ్గరగా వచ్చింది. సుబ్బారాయుడు చంద్రశేఖరం చెయ్యి చప్పున వదిలేసి విగ్రహంలా నిలబడిపోయినాడు.

రాధ నడచివస్తున్నది.

ఎదురుగా నిలిచి చూచింది.

వెళ్ళిపోయింది.

సుబ్బారాయుడు తలవొంచుకుని గుడివేపు వెళ్ళాడు. చంద్రశేఖరం ఇంటివేపు నడిచాడు. అతడికి ఆశ్చర్యమైంది. రాధ అప్పుడే వెళ్ళిపోతున్నదెందుకో! సుబ్బారాయుడు లేకపోయినట్లైతే రాధని తాను పలుకరించివుండేవాడు. చంద్రశేఖరం ఇల్లు చేరుకునేటప్పటికి ఇంట్లో సోమిదేవి తప్ప ఎవరూ లేరు.

"నువ్వు గుడికి వెళ్ళలేదెంచేత వదినా?" అన్నాడు చంద్రశేఖరం చాలా సౌమ్యంగా.

"గుళ్లూ గోపురాలూ, ఇవే తక్కువ ఈ బ్రతుక్కి! యీ యోగమింతే" అన్నది సోమిదేవి చాలా విసుగు వ్యక్తపరుస్తూ.

చంద్రశేఖరం గతుక్కుమన్నాడు. నిజానికి వదినగారు అంత విసుగుదలతో వుండటానికి కారణాన్ని అతడూహించలేదు.

ఇంట్లో ప్రతి అడుగడుక్కీ విసుగుదల తిష్ఠ వేసుకున్నది. ఇంట్లోని వ్యక్తులందరూ వొకర్ని చూసి వొకరు విసుగుపడతారు. ముఖం చిట్లించుకుంటారు. సామరస్యం ఎక్కడా కన్పించదు. అభిమానం ఏకోశానా వ్యక్తమవదు. ఆదరణ కన్పించదు.

చంద్రశేఖరం మంచం వాల్చుకుని కూచున్నాడు.

సోమిదేవి చాప పరుచుకుని పడుకుంది.

"ఇంటో నేనుంటాను గదా, నువు వెళ్ళిరా వదినా" అన్నాడు చంద్రశేఖరం.

"నాకు యీ ఇల్లే ఆలయం. మీరంతా దేవుళ్ళు" అన్నది సోమిదేవి కృత్రిమంగా నవ్వుని అభినయిస్తూ. చంద్రశేఖరం నవ్వి "మేమంతా అంటే వొప్పుకునేది లేదమ్మోయ్! పతియేకదా దేవుడు" అన్నాడు. సోమిదేవి నవ్వు నాపుకుని "అవునుగాని నువ్వు వొప్పుకుంటావా? పతియే దేవుడని?"

"అవన్నీ పూర్వపురోజులమ్మా. ఇప్పుడెవరూ వొప్పుకోరు. నీకు తెలీదొదినా, ప్రపంచం మారిపోతోంది. భార్యాభర్తలు సమానమూ, హక్కులూ సమానమూ. ఆడదెంతో మగవాడూ అంతే. ఇద్దరూ కలిసి పనిచేస్తారు, ఇద్దరూ కలిసి తమ సంతానాన్ని పోషించుకుంటారు"

సోమిదేవికి ఇవన్నీ అర్థంకాలేదు. అర్థంకానప్పుడు ఆమె మెదలకుండా వూరుకుంటుంది. చంద్రశేఖరం హుషారులో "మరి ఏమంటా విప్పుడు?" అన్నాడు.

"అందుకే ఇట్లా నాశనమైపోతున్నది. వర్ణసంకరం. అవ్వ! ఆడాళ్లు ఉద్యోగాలు చెయ్యడమేమిటి? బళ్లో ఆడపంతులమ్మ వున్నదటగా, ఆయన చెప్పారు?" అని నవ్వింది సోమిదేవి.

చంద్రశేఖరానికి చప్పున గుర్తొచ్చింది. వెళ్ళి పుస్తకాలు తెచ్చుకోవాలి అనుకున్నాడు.

"తక్కువకులాల్లో అయితే పట్టింపులులేవు. మనమూ తెగబడిపోయినాం. అందుకే ఇట్లా యేడుస్తున్నాం. వాళ్ళ రామ్మూర్తిగారి పార్వతిని చూడూ! అయ్యో రాత! ఒకరి ననటం దేనికి! నిన్న మొన్నటిదాకా మన సరస్వతి లేదూ మనింట్లో..." సోమిదేవి ఏదో ఆవేశంగా చెప్పాకపోతున్నది. చంద్రశేఖరం మనస్సు చివుక్కుమంది; ఇంతలో సూరినారాయణశాస్త్రి వచ్చాడు. సోమిదేవి చప్పున లేచి నిల్చుంది. ఇంట్లోకి వెళ్ళిపోయింది.

సూరినారాయణశాస్త్రికి తమ్ముణ్ణి పలకరించటం అనివార్యమైపోయింది.

"ఏమిరా, మరి నువ్వు ఏం చేసేటట్టు? ఎక్కడైనా ఉద్యోగప్రయత్నంచేస్తావా?" అన్నాడు.

చంద్రశేఖరానికి హృదయంలోని బరువు తీసేసినట్లైంది.

"ఈ పరీక్ష పూర్తిచేసుకుని గాని ఆలోచించను" అన్నాడు.

సూరినారాయణశాస్త్రిముఖం చిన్నపోవటం చంద్రశేఖరం గమనించలేదు.

"అయితే మళ్ళీ పట్నంపోవాలా?" అన్నాడు సూరినారాయణశాస్త్రి.

చంద్రశేఖరానికి [illegible] కొత్తబలం వచ్చినట్లయింది. సుమారంతో [illegible] కన్పించింది.

“అప్పు [illegible]” ఆప్యాయత నిండుకున్నట్లు.

సూరినారాయణశాస్త్రి ఏమేనా చెబుతాడని ఆశించాడు చంద్రశేఖరం. కాని సూరినారాయణశాస్త్రి “ఇదిగో వస్తున్నా” అని సోమిదేవి పిలిచినట్టు ఉలిక్కిపడి ఇంట్లోకి వెళ్ళిపోవటంతో ఆ ఆశ నిరాశగా మారిపోయింది. సూరినారాయణ శాస్త్రి దొడ్లో సిల్లిగోసుకుంటూ తమ్ముడిని గురించే ఆలోచించాడు. చంద్రశేఖరం ఆకాశంలోని నక్షత్రాలకేసి చూస్తూ, ఎట్లా నేను పట్నంపోతాను? అని ప్రశ్నించాడు.

“మాకు తెలీదు” అన్నాయి చుక్కలు.

అతడిహృదయం బాధగా మూలిగింది.

కొద్దిసేపు గడచినతర్వాత సోమిదేవి ఇంట్లోంచి పిలిచింది.

చంద్రశేఖరం లేచి అన్నసరసనే భోజనానికి కూచున్నాడు.

సూరినారాయణశాస్త్రి మళ్ళీ తమ్ముడిచదువుసంగతే యెత్తలేదు.

చంద్రశేఖరమే ఆ సంగతి మళ్ళీ తీసుకొద్దామనుకున్నాడు. కాని ఆలుమగలు అత్యాసక్తితో ఊళ్లోవాళ్ళవిషయాలు చర్చిస్తుంటే చంద్రశేఖరం మాట్లాడటానికి వీలులేకపోయింది. తిరిగి తిరిగి రామమూర్తిగారికుటుంబంమీదికి వచ్చింది చర్చ.

"కూతురు అలా ఎకుగుతుంటే రామ్మూర్తికి చీమ కుట్టినట్లైనా వుండదేం!" అన్నాడు సూరినారాయణశాస్త్రి.

"మనమేం చేశామేమిటి! ఏ రామశాస్త్రిలాటివాడో ప్రత్యక్షం కావద్దూ" అన్నది సోమిదేవి, అందులోనే వ్యంగమూ, అపహాస్యమూ మేళవింపచేసి. చంద్రశేఖరానికి గుండెల్లో మంటపుట్టింది.

సూరినారాయణశాస్త్రి ఆలి తెలివితేటలకు అతిగా సంతోషిస్తాడు. అందుచేత సోమిదేవి ఎలా మాటాడినా అతడికి ఆనందంగానే వుంటుంది. ఆ చర్చ అంతటితో అంతమవలేదు. వాళ్ళ ఇంట్లో విషయాలూ, వాళ్ళ మాటాడేతీరూ చెప్పుకుని నవ్వుకున్నారు.

తరువాత సూరిశాస్త్రీ, సుబ్బమ్మగారూ ఇల్లు చేరుకున్నారు. చంద్రశేఖరానికి ఆ రాత్రి సరిగా నిద్రపట్టలేదు. ఎంతసేపూ ఇంటో వ్యక్తుల వింతైన స్వభావాలగురించే మననంచేసుకున్నాడు. మర్రోజున చంద్రశేఖరానికి ఎక్కడనుంచో ఉత్తరం వచ్చిందంటూ తండ్రి తెచ్చి ఇచ్చాడు.

చంద్రశేఖరం విప్పి చదువుకున్నాడు.

అందులో రామశాస్త్రి ఇంటివిషయాలు వ్రాసి మళ్ళీ పరీక్షకు కడుతున్నావా? అనీ, ఫలాని తేదీ లోపున పరీక్షఫీజు చెల్లించాలనీ, యీసారి మద్రాసు వెళ్ళవద్దనీ, ఇంటివద్దనే వుండి చదువుకోమనీ, ఎన్నో సలహాలు జోడిస్తూ వ్రాశాడు. తానేదో ఉద్యోగప్రయత్నంలో వున్నాననికూడా వ్రాశాడు. చంద్రశేఖరశాస్త్రి ఆ ఉత్తరాన్ని రెండుమూడుసార్లు తిప్పి

చూసుకున్నాడు. కాని ఎక్కడా సరస్వతివ్రాసిన అక్షరం కన్పించలేదు.

అతడిమనసు కేదో వెలితి గోచరించింది.

తండ్రి అడిగాడు, తల్లి అడిగింది, ఎక్కడనుంచీ ఉత్తరం? అని.

చంద్రశేఖరం చెప్పాడు.

వెంటనే వాళ్ళు సరస్వతినిగురించే అడిగారు.

సరస్వతి క్షేమసమాచారాలు విపులంగా లేకపోయినందువలన తమకుకలిగిన అసంతృప్తిని తల్లిదండ్రులు దాచుకోలేకపోయారన్నసంగతి గ్రహించటాని కెంతోసేపు పట్టలేదు చంద్రశేఖరానికి.

# 8

ఉత్సవాలు కాస్తా అయిపోయినయ్. గుడిలో సందడి తగ్గింది. పెళ్ళిచేసేసి, ఇక మీ యిష్టం, మీ రెలానైనావుండండి అని దేవుడికి చెప్పి పెద్దలంతా తప్పుకున్నారు. పందిరి ఊడ తీశారు. మళ్ళీ గాలీ – వెలుతురూ, గుడినిండా కమ్ముకుంది. గుడిగోడలనిండా నూనెమరకలూ, కర్పూర సాంబ్రాణీ మధురిమలూ చిమ్ముతున్నాయి. ఆలయపుశిఖరంమీది పావురాళ్ళు "బ్రతికిపోయాం, వాళ ఆ గోల" అనుకున్నాయి. కుఱ్ఱకారుకి దేముడిపెళ్ళి ఇంత త్వరలో అయిపోవటమనేది ఏ మాత్రమూ రుచించలేదు. ఇంకా చాలానాళ్ళు ఇలానే కోలాహలంగా వుండి, ఇంకా ఇంకా ప్రసాదాలు పంచుతూవున్నట్లయితే బావుండేది అనుకున్నారు వాళ్ళంతా.

స్వామి మాత్రం అప్పుడూ ఇప్పుడూ వొకేలావున్నాడు. ఆయనకళ్ళు అప్పుడూ నవ్వుతూనే వున్నాయి. ఇప్పుడూ నవ్వుతూనే వున్నాయి. కాని పూజారిమాత్రం ఇప్పుడు ఇదివరలో లాగా స్వామిని అలంకరించటంలేదు. ఇదివరలోవలె చందన చర్చలూ లేవు, మాలా కైంకర్యమూ లేదు. ఏదో శాస్త్రార్థం పూజారి తిరుచూర్ణమూ, సిందూరమూ తీరుస్తున్నాడే కాని, బంగారునామాలు పెట్టటంలేదు. ఎప్పుడో ఆయనదయ వచ్చి నప్పుడు పొద్దుపోయి, సూర్యుడు మరోవేపుకి తిరగబోయేప్పుడు వచ్చి ఇంత నైవేద్యంపెట్టి పొయ్యేవాడు.

అంతా మామూలుగా జరిగిపోతున్నది. దేవుడు మాత్రం రథోత్సవం ఎప్పుడా అని రోజులు లెక్కపెట్టుకుంటు న్నాడు. ఉత్సవవిగ్రహాలు సందడిచేస్తున్నాయి ఎప్పుడో రాబోయే రథోత్సవానికి. ఆర్నెల్లముందునుంచే హడావుడి.

రాధమాత్రం రోజూ గుడికి వస్తూనే వుంది. పొగడ చెట్టుక్రింద పువ్వులు యేరి ఒక్కొక్కపువ్వే వోపికగా గుచ్చి, వొక్కపాటపాడి వినిపించి, సంధ్యవేళ హారతి చూసి, సగం మాల తానుతీసుకుని ఇల్లు చేరుతుంది.

ఇంటివద్ద అమ్మ భాగవతం చదువుతుంటే రాధకు కారణం లేకుండానే కళ్ళనీళ్లుకమ్మేవి. పొగడపూలదండ మెళ్లో వేలాడుతూ వేణుగోపాలుడు మనోనేత్రాలముందు కన్పించే వాడు.

శ్రావణంకూడా వెళ్ళిపోయింది. చెదురుగా వర్షాలు

పడ్డాయి. రోడ్లలో తోటల్లో చేమంతిపూలు విచ్చుకున్నాయి. బంతిమొక్కలు తలలెత్తి పులకరించిపోయినయ్.

ఓవిధంగా యీ జీవితం బాగానేవుంది రాధకు. కలుష వాతావరణంలోంచి స్వచ్ఛమైనగాలి, విశాలమైన ఆకాశంలోకి వచ్చి హాయిగా బ్రతకవచ్చు నిక్కడ. ఇక్కడ విమానాలు ఎగురుతున్న చప్పుళ్ళు. దిగుతున్న ధ్వనులూ విన్పించవు. ఇక్కడ రంగురంగులపూలతో క్రోటన్ మొక్కలు కనిపించక పోయినా, ఏ పెరట్లో చూసినా, ఇన్ని సంధ్యామల్లెపూలో, ఇన్ని తెల్లచామంతులో సంధ్యావేళకు తప్పకుండా వికసిస్తాయి. ఇక్కడ భూమికీ ఆకాశానికీ అవతలతీరాలు కన్పిస్తాయి. సైరనిక్కడ టైము చెప్పాల్సిన పనిలేదు. ఎడతెగకుండా బడిగంటలు వినబడవు. ఐస్క్రీమ్‌వాడి కేకలూ, రిక్షావాళ్ళ మువ్వల చప్పుళ్ళూ, పేపర్ బోయ్ కేకలూ, సోడాబుర్రధ్వనులూ ఏవీ విన్పించవు. అయినా ఇక్కడ ఎంత సుఖం!

ఎంత తృప్తి!
ఎంత హాయి!

ఎటువంటి మంచిగాలి!

ఇక్కడ దేవుడుకూడా వెర్రిబాగులవాడే. ఉత్సవసమయాల్లో టిక్కెట్టుడబ్బులు వసూలుచేసుకోవటం యెరుగడు. ఎలక్ట్రిక్ లైట్లను చూసేవుండడు. రేడియోలూ, లౌడ్‌స్పీకర్లూ ఏమున్నాయి కనక!

అయినా యీ దేవుడిలా అప్పుడప్పుడు రాలిన పొగడ పూలను ఆ దేవుడు ధరించగలుగుతాడా!

ఆయనకు కొన్ని సుఖాలు, తనకు కొన్ని!

రాధ కీ వాతావరణం హాయిగా వుంది.

పగటిపూట తోటపనన్నా చేసేది, పుస్తకాలు చదువు కునేది. లేకపోతే రేడియో పెట్టుకొని వినేది. బేటరీ వొంటి తెచ్చుకుంది.

సాయంకాలం ఆలయానికి వెళ్ళేది.

రాత్రిపూట భారతం పారాయణం చేసేది అమ్మ. ఎప్పటికో, ఎంత పొద్దుపోయిన తర్వాతకిగానో నిద్ర.

ఇలానే కాలం గడుస్తున్నది ఒడిదుడుకులు లేకుండా.

ఒకరోజు సాయంకాలం గుళ్లో చంద్రశేఖరం కనిపిం చాడు రాధకి.

చంద్రశేఖరం ఆశ్చర్యపోయాడు.

రాధకూడా ఆశ్చర్యపడ్డది.

మంటపంలో కూచుండిపొయ్యాడు చంద్రశేఖరం. పొగడపూలన్నీ వొడినిండా ఏరుకుని వొకొక్కటే గుచ్చటం మొదలెట్టింది రాధ.

"సరస్వతికి పెళ్ళయి అత్తారింటి కెళ్ళిందటగా?" అన్నది రాధ తానే సంభాషణని ప్రారంభిస్తూ.

"ఊఁ..." అన్నాడు చంద్రశేఖరం.

"నువుకూడా చాలా మారిపోయావే!" రాధ నవ్వింది. చంద్రశేఖరం రాధవేపు తదేకంగా చూశాడు.

"నేనూ మారిపోయాను కదూ?" అన్నది రాధ.

చంద్రశేఖరం దీనికి సమాధానంగా నవ్వాడు.

"నువ్వు రోజూ గుడికి వస్తావా?" అని అడిగింది.

"రాను. ఇవాళ మాలపంతులువాళ్ల ఇంటినుంచి వస్తూ వస్తూ తొంగిచూశాను. నువ్వు కనిపిస్తే వచ్చాను."

రాధ నవ్వింది. "అయితే దేవుణ్ణి చూడటానికా, నన్ను చూడటానికా?"

"నీ పాట వినొచ్చని..." అన్నాడు చంద్రశేఖరం.

"నా పాట అంటే అంత ఇష్టమైతే మా యింటికే రావచ్చును కదూ" అంది రాధ

చంద్రశేఖరం నిరుత్తరుడైనాడు.

"మాయిల్లుగుర్తులు నీకు తెలీవుకదూ!" రాధ పళ్ళుబిగబట్టి తమాషాగా నవ్వుతున్నది.

"నాకు తెలుసాయేం మరి?"

"మరయితే చెపుతాను. ముందు ముక్కుకుసూటిగా బయలుదేరి తూర్పుగాపోతే అక్కడ మర్రిచెట్టు కనిపిస్తుంది. అక్కడినుండి దక్షిణంగా కొంతదూరంపోతే బర్రెదూడ కట్టేసి వుంటుంది. అటునుంచి ఉత్తరపువేపుగా వెళ్ళి పడమరకి తిరిగితే మా యిల్లు వస్తుందిగా. అయితే రేపొకసారి వస్తావా?" రాధ పగలబడి నవ్వింది. అందులో అంతగా నవ్వాల్సిన విషయం ఏమిటుందో! నవ్వి నవ్వి అలసటతో రొప్పుతూ కూర్చుంది.

చంద్రశేఖరంకూడా నవ్వాడు.

"అయితే భూప్రదక్షిణం చెయ్యమంటావు?"అన్నాడు.

రాధ లేచి పూలమాల ఓపక్కన పెట్టింది. ఇంతలో పూజారి వచ్చాడు.

సంధ్యాహారతికి సామగ్రిఅంతా సిద్ధమైంది. పూజారి రాధచేతిలోంచి మాల తీసుకుని స్వామికి అలంకరించాడు.

రాధ నో అష్టపది పాడింది.

ఇంటికి వెళ్ళిపోయేప్పుడు రాధ మళ్ళీ అన్నది.

"రేపెప్పుడైనా మా ఇంటి కోసారి రాకూడదా? చిన్నప్పుడైతే రోజూ దొంగలా, అడుగులో అడుగేసుకుంటూ వచ్చేవాడివి కదూ!"

చంద్రశేఖరం మాట్లాడలేదు.

రాధ వెళ్ళిపోయింది.

ఇంటికి వెళ్ళేదాకా చంద్రశేఖరం రాధమాటలనే తరచి తరచి మననంచేశాడు. అతడికి బాల్యమంతా కన్నులకు కట్టి నట్లనిపించింది. రోజూ తండ్రో తల్లో తనని దండిస్తున్నా, తాను రాధవాళ్ళింటికి పరుగెత్తుకపొయ్యేవాడు. కొన్నాళ్లు చూసి ఏంచెయ్యలేక వూరుకున్నారు. తల్లి తండ్రీ. తాను రోజూ వెళ్లేవాడు. కలకండా, అరటిపళ్ళు, ఇంకా బిస్కట్లు ఏవో దొరుకుతుండేవి అక్కడ తనకు. ఇంకా హాయిగా ఉయ్యాల బల్ల ఎక్కి ఊగవచ్చు. రెండురోజులతర్వాత చంద్రశేఖరం వాళ్ళింటి కెళ్ళాడు.

నడిమిహాల్లో రాధ ఉయ్యాలబల్ల మీదకూచుని ఏదో పుస్తకం చదువుకుంటున్నది. వాళ్ళమ్మ ఎదురుగా కూచుని పూలమాల కడుతున్నది.

రాధకు ప్రాణం లేచివచ్చినట్లు వచ్చి చంద్రశేఖరానికి కుర్చీ చూపించింది.

చంద్రశేఖరం వాళ్ళింటికి వద్దామని రాలేదు. ఏవో శక్తులు అతణ్ణి అక్కడికి లాక్కొచ్చినవి.

రాధవాళ్ళమ్మ చంద్రశేఖరాన్ని పలకరించింది.

"మేం గుర్తున్నామా?" అంది.

చంద్రశేఖరం చప్పున సమాధానం చెప్పలేక తలవంచుకున్నాడు. నవ్వాడు.

"ఇప్పుడు ఎంతమటుకు చదివావు?" అన్నది ఆమె.

చంద్రశేఖరం చెప్పాడు.

"అబ్బో! చిన్నతనంలో అల్లరే ఎక్కువగాని చదువు జోలే వట్టేదిగాదు. అటువంటిది పెద్దచదువు చదివావు" అంది ఆమె.

రాధ నవ్వింది.

"నన్ను చదువుకోనిచ్చినట్లైతే నేనుమాత్రం చదివే దాన్ని కాదా ఏమిటి?" అంది.

ఆవిడ నవ్వి "చదివి ఏం వెలగబెడతావు?" అంది.

"అలా అనే మాన్పించావు. ఇప్పుడైతే నీమాట వినే దాన్ని కాదు" అంది రాధ.

"ఏమోనమ్మా, నా కెందుకీ అప్రతిష్ట! అంతగా చదువుకోవాలనివుంటే ఇప్పుడైనా చదువుకోవచ్చునుగా" అంది.

ఏదో వొక్కసారిగా స్ఫురించినట్లుగా రాధ ఉత్సాహం చూపుతూ "నాకు రోజూ వచ్చి నువ్వు ఇంగ్లీషు నేర్పకూడదూ?" అంది చంద్రశేఖరంవేపు చూస్తూ.

చంద్రశేఖరం నవ్వాడు.

"చెన్నపట్నంలో చదువుకునేటప్పుడు నా కో స్నేహితు

డుండేవాడు. మాంబళంలో చిన్న ఇల్లు అద్దెకుతీసుకుని కాపరం పెట్టాడు. వాడికి చాలా కోరికగావుండేది, ఆవిడకు ఇంగ్లీషు రావాలని. మూడునెలలు కష్టపడితే ఆమె నాలుగుమాటలు నేర్చుకుని వాటిని మరచిపోయింది..." చంద్రశేఖరం ఇక చెప్పలేదు.

రాధ సిగ్గుపడ్డది.

"అయితే నేనా బావతుగాదు. పట్టుపట్టానంటే అంతు తేలేదాకా వదలను. అయినా నాకు జంజాటమేముంది? ఆమె కంటే పాపం, సంసారమూ..." రాధ ఆపేసింది.

రాధవాళ్ళమ్మ లేచి ఇంట్లోకిపోయింది. రాధ చెప్పింది.

"మేము మద్రాసులోవుండగా, ఎక్కడేనా స్కూల్లో చేరి చదువుకుందామనుకున్నాను. మా అమ్మ పడనిస్తేగా! తంగమణిఅయ్యారని మంచి సంగీతవిద్వాంసుడు. ఆయనదగ్గర సంగీతం నేర్చుకునేదాన్ని. కాలేజీలో వో లెక్చరరుగా వుండే దామె మేరీస్ కాలేజీలో. ఇంటికొచ్చి ప్రైవేట్ చెప్పేది. నేను మెట్రిక్ ప్యాసైనాను" అంది రాధ కళ్లుతిప్పుతూ.

చంద్రశేఖరం ఆశ్చర్యపోయ్యాడు.

రాధ ఇంత విజ్ఞానవంతురాలని అనుకోలేదు చంద్రశేఖరం. చిన్నప్పటివలెనే వుంది అనుకున్నాడు.

"అయితే మీారు ఇన్నాళ్ళనుంచీ చెన్నపట్నంలోనే వున్నారేమిటి?" అన్నాడు చంద్రశేఖరం.

"ఏదేళ్ళనుంచీ. అంతకుముందు ఎక్కడెక్కడో తిరి

గాము. తరువాత ఆయన అంటే మానాన్న పోయారు. హఠాత్తుగా జరిగింది. మేము ఇక్కడికి వచ్చేశాం" అంది రాధ.

చంద్రశేఖరం ఇంకా ఇంకా అడుగుదామనుకున్నాడు గాని, రాధవాళ్ళమ్మ రావటంతో ఆ ప్రసంగం ఆగిపోయింది.

ఆమె గ్లాసునిండా పాలుపోసుకుని తీసుకొచ్చింది.

"మీరు బ్రాహ్మలు. అయినా పాలకేమీ తప్పులేదు కదూ" అన్నదామె చంద్రశేఖరాన్ని తీసుకోమని సూచిస్తూ.

చంద్రశేఖరాని కా మాట నచ్చలేదు.

రాధ నవ్వింది.

చంద్రశేఖరం తీసుకున్నాడు.

రాధ రేడియో ట్యూన్ చేసివచ్చి "అయితే ఎప్పటి నుంచి మొదలు నాకు చదువుచెప్పటం?" అంది.

"నేను ఇక్కడ వుండకపోవచ్చును" అన్నా డతడు.

"పోనీ వున్నన్నాళ్ళే" అన్నది రాధ.

మొత్తానికి తీరికసమయాల్లోవచ్చి చదువుచెప్పేటందు కొప్పుకున్నాడు చంద్రశేఖరం.

"అయితే మేష్టారూ, పుస్తకాలూ అవీ మీరే తెప్పించండి" అంది రాధ చిన్నపిల్లలా నవ్వుతూ.

చంద్రశేఖరంకూడా నవ్వాడు.

చంద్రశేఖరం తిరిగి ఇంటికొచ్చేసరికి తండ్రీ, అన్నా ఏదో వాగ్వివాదంలోవున్నారు. ఆ తాపత్రయమంతా డబ్బు గురించే అన్న సంగతి తెలిసికొనటాని కతడి కెంతోసేపుపట్టలేదు. సరస్వతి పెళ్ళికిగాను సూరిశాస్త్రి కొన్ని అప్పులుచేశాడు. ఇప్పుడా అప్పులవాళ్లు గొంతుమీద కూచుంటున్నారు.

ఆ విషయం కొడుకుతో సంప్రదించబోతే, గోలగా తయారైంది, నలుగురూ వింటే నవ్విపోయేట్లు.

సోమిదేవి తనకేంపుకని వూరుకోకుండా అప్పుడో మాట, అప్పుడో మాట జారవిడుస్తున్నది. చంద్రశేఖరానికి వాళ్ళంతా కంపరమెత్తిపోయింది. "ఇంటిలోన పోరు ఇంతింత గాదయా" అని ఆ మహానుభావుడు ఎప్పుడో చెప్పాడు.

అతడు వొక్క క్షణంకూడా అక్కడ వుండలేక పోయాడు. పోయి మఱ్ఱిచెట్టుకింది కాఫీహోటల్లో కూచున్నాడు. కాఫీ తీసుకరమ్మన్నాడు. హోటలుయజమానికి చంద్రశేఖరం వచ్చి కాఫీతాగటం గర్వకారణంగా వుంది. ఓవిధమైన అహంభావంకూడా వచ్చింది. లోపల్లోపల ఏంబాపనోళ్లు అనుకున్నాడు.

చంద్రశేఖరం కాఫీతాగి పేపరు చూశాడు. అది నిన్నటి పేపరు. ఏవో పరీక్షాఫలితాలు కన్పించాయి. చంద్రశేఖరానికి తన పరీక్ష జ్ఞాపకానికొచ్చింది. అతడు పరీక్షసంగతే ఆలోచిస్తూ కూర్చున్నాడు. ఫీజుకూడా కట్టాలి. గ్రామఫోనుమీద అరిగిపోయిన పాతరికార్డు గోలపెడుతున్నది.

ఇంతలో మాలపంతులు వచ్చాడు. ఊళ్లో ఆయనను అందరూ అలానే పిలుస్తారు. ఆయన పేరు జోసెఫ్. ఆయనను ఆ పేరున పిలిచినపాపాన ఎవ్వరూపోరు. ప్రత్యక్షంగా ఆయనతో మాట్లాడవలసివస్తే 'పంతులూ' అని సంబోధిస్తారు.

పరోక్షంలో బళ్లోచదువుకునే పిల్లకాయలవద్దనుంచి పెద్దవాళ్ళవరకూ మాలపంతులనే చెపుతారు.

"ఏమండోయ్" అని పలకరించాడు జోసెఫ్.

ఆయన్ను చూడగానే చంద్రశేఖరానికి ప్రాణం లేచి వచ్చినట్లయింది.

"ఏమండీ పుస్తకాలు?" అన్నాడు చంద్రశేఖరం.

జోసెఫ్ నవ్వాడు.

"నా చంకన పెట్టుక తిరుగుతానా?" అని "ఓసారి మా ఇంటికి రాకూడదా? చూసి తీసుకపోవచ్చు. లేకపోతే స్కూలుకు రండి. స్కూలుపక్కనే మా ఇల్లు" అన్నాడు.

చంద్రశేఖరం చాలాసేపు అక్కడే కూచున్నాడు. ఆలోచనలలో మునిగి టైమెంత గడుస్తున్నదీకూడా మరచి పోయాడు.

సుమారు ఓగంట అలానే అక్కడ కూచుని ఇంటికి వచ్చాడు. ఇంటికివచ్చేసరికి మార్పేమీ కనపడలేదు. అన్న గారూ, తండ్రీ ఎడమొహం పెడమొహంగా కూర్చుని వున్నారు.

చంద్రశేఖరానికి విసుగుపుట్టింది. కోపమొచ్చింది. ఏడుపొచ్చింది.

ఇటువంటి పరిస్థితుల్లో అతడు పరీక్షఫీజుకట్టి పరీక్షకు చదవటం అనేది పెద్ద సమస్యగా రూపొందింది.

ఆ రాత్రి అంతా అదే ఆలోచన.

జీవితంలో యీ అడ్డంకులను అధిగమించి ఒక గమ్యాన్ని చేరుకోవడానికి ఆ పరీక్షప్యాసుకావటం అవసరం.

కాని ప్రస్తుతం జీవితమే ఓ పరీక్షగా తయారైంది. కలతనిద్రతో తెల్లవారింది.

# 9

ఆశ్వయుజంకూడా వెళ్ళిపోయింది.

చంద్రశేఖరం కష్టపడి అప్పుచేసి పరీక్షఫీజు కట్టాడు. రోజులు మామూలుగానే భారంగా దొర్లిపోతున్నాయి.

శరన్నవరాత్రులు శివాలయంలో కోలాహలంగా నడచి పోయాయి. దేవుడికి చాలామాన్యాలు వున్నాయి. ధన కనక వస్తు వాహనాలూ వున్నాయి.

అయినా వొక్క దసరాకితప్ప దేముడి ఆలనా పాలనా చూసేవాళ్లెవరూ లేరు.

కాలం మారిపోతున్నది. ప్రతిచోటా అన్యాయము ప్రబలిపోతున్నది.మానవస్వభావం కుంచించుకుని అణగారిపోతు న్నది. దైవభక్తి, ధర్మభీరుత్వమూ అణగారిపోతున్నాయి.

అందుకే శివాలయంలో గోడలు పడిపోతున్నా, ఆవరణలో గడ్డీ గసురూ పెరిగి విషజంతువులు నివసిస్తున్నా, పుట్టలు పెరుగు తున్నా ఎవరూ పట్టించుకోరు. ధర్మకర్తలూ పట్టించుకోరు. ఇంక పూజారీ పట్టించుకోడు. వెఱ్ఱిబాగులవాడు ఆ దేవుడు అసలు పట్టించుకోడు. త్రిలోకైకజనని, సర్వమంగళ, సర్వ సంపదలకూ యిక్కడైయె తనపుట్టిల్లు విలసిల్లుతున్నా అద్రితనయ మాసివాయినపు ముత్తయిదువులా కనపడుతోంది. అయినా ఆమెకు ఆభరణాలు అలంకరించరు. కొత్తపుట్టాలు కట్టబెట్టరు.

"గుడిపాడైనా గూబ వదలదూ
గుడి పొలాల పూజారి వదలడూ"

అని వ్రాసింది బాపిరాజుగారు కామోసు! అలానే నిత్యం ఆ పూజారిమాత్రంవచ్చి ఇంత బోనంచూపించి, వొక్క దీపం వెలిగించి పోతుంటాడు

ఆశ్వయుజం కాస్తా ఆ హడావుడిలో గడచిపోయింది. ఆ నాలుగురోజులూ దేవుడికి, అమ్మవారికి అలంకారాలూ అవీ చేశారు. ఊరేగింపుజరిపారు. చంద్రశేఖరం అటు వేపుకూడా పోలేదు. పారువేటనాడుమాత్రం పోయి పదినిముషాలు చూసి వచ్చాడు. ఇప్పుడు చాలా జాగ్రత్తగా చదువుతున్నాడు. మానసిక అశాంతిని అధిగమించి, సర్వశక్తులనూ కూడదీసుకొని చదువుతున్నాడు. ఎప్పుడన్నా రాధవాళ్ళింటికి వెళ్ళివస్తుంటాడు. ఈలోపున సుబ్బారాయుడు ఐదారుసార్లడిగాడు. "ఏం విశేషం? నువ్వు రోజూ వాళ్ళింటి కెందుకెళతావు?" అంటూ.

వాడిమొహం రక్కాలనిపించింది చంద్రశేఖరానికి. పాడుప్రపంచం అని తిట్టుకున్నాడు. ఊరబావికి నీళ్ళకు వెళ్ళేప్పుడూ, గుడికి వెళ్ళేప్పుడూ వొళ్ళంతా కళ్లుచేసుకుని చూసేది పార్వతి.

ఎప్పుడైనా ఉత్తరాలు అడగటానికిగాని వస్తాడనుకునేది. కాని చంద్రశేఖరం ఎక్కడా కనవడటమే మానేశాడు.

పార్వతి ఎన్నో కలలుకంటున్నది.

సరస్వతి వొక్కసారి ఇక్కడకువస్తే బావుండునని అనిపిస్తుంది పార్వతికి రోజూ.

ఇంట్లోనూ వుండలేడు. బయటా తిరగలేడు చంద్రశేఖరం. మనసంతా వూగిసలాడుతూవుంటుంది ఎప్పుడూ. చిన్న ఇల్లు. ఒకమూలను ఒకమంచం వాల్చుకుని చదువుకుందా

మని ప్రయత్నంచేస్తాడు. కాని అతడి ప్రయత్నాలు కొనసాగవు. సోమిదేవి అటువేపుకి వస్తుంది. లేకపోతే తండ్రికాని విషణ్ణవదనంతో మనసులో మెదులుతాడు.

ఇంట్లో కాఫీపెట్టమని అడగటానికికూడా అతడికి భయమే. ఒకటి రెండుసార్లు వదినగారు విసుక్కుంది. అందువలన అతడు పోయి హోటల్లో కాఫీతాగి వస్తాడు. ఏదో చదువుదామనుకుంటాడు. చదువుకునే రోజులూ, స్నేహితులూ, ఇంకా అప్పటి అనుభవాలు, ప్రతిజ్ఞలూ, సినిమాలు అన్నీ గుర్తొస్తాయి.

ఇంతలో పార్వతి కళ్ళలో మెదులుతుంది. సరస్వతి గుర్తొస్తుంది. రామశాస్త్రి గుర్తొస్తాడు. సరస్వతి అత్తవారిల్లూ, వాళ్ళకాపరమూ ఇవే సంగతులు ఆలోచిస్తూవుంటాడు.

చేతిలోని పుస్తకంలో పేజీలు తిరగవు. ఒక్కసారి తెలివివస్తుంది. నవ్వూ, యేడుపూ కాని ఒక అనుభూతి అతణ్ణి ఆవరించుకుంటుంది.

ఒకరోజున సరస్వతినుంచి ఒక ఉత్తరంవచ్చింది. అలాటి ఉత్తరం సరస్వతివద్దనుంచి వస్తుందని, ఇంట్లోవాళ్ళు ముఖ్యంగా చంద్రశేఖరం ఎప్పుడూ వూహించియుండలేదు.

చంద్రశేఖరం రసాతలానికి కృంగిపోయినాడు. భూమీ, ఆకాశమూ, గోడలూ, మేడలూ, వాడలూ ఏవీ కనిపించటంలేదు అతడికి కొద్దిసేపు కారుచీకటి, కొంతసేపు కళ్లు భరించలేని వెలుగు. వెయ్యినాల్కలుసాచి కాటందబోతున్న భ్రాంతి. వెయ్యిశక్తులు అదిమివేస్తున్నట్లు భయం.

అతడు నిలవలేకపోతున్నాడు. ఇంట్లోవాళ్ళంతా ఒక్క

సారిగా ఏం జరిగింది? అని ఆశ్చర్యంతో నిలుచుండిపోయారు.

తరువాత అందరు చదువుకున్నారు.

తండ్రికి సంబోధించి సరస్వతి ఆ ఉత్తరం వ్రాసింది.

నాన్నా!

నేను బాగానే వుంటున్నానని వ్రాస్తే మీకు బావుంటుంది కనుక నేను బాగానే వుంటున్నాను. ఇక్కడ ఆయన కూడా ఆయనకు ఎలా బావుంటుందో అలా వుంటున్నారు. ఒక్కసారి నన్ను అక్కడకు తీసుకునిపొండి. ఈమధ్య నా ఆరోగ్యం బాగుంటంలేదు. ఆయన ఎక్కడెక్కడో ఉద్యోగాలకు ప్రయత్నాలు చేస్తున్నారట. అవేం నాకు తెలీవు. నా ఆరోగ్యంగురించి ఆయనకు దిగులూ, చింతా ఏవీ కన్పించవు.

అమ్మకి నమస్కారములు. పెద్దన్నయ్యనీ, వదిననూ అడిగానని చెప్పండి. ఇంతకూ ఎవరిఖర్మకు ఎవరూ కర్తలు కాదుకదా! ఎవరు చేసుకొన్నది వారనుభవించాలి. ఎవరు నోచుకున్నది వారే అనుభవించాలి. చిన్నన్నయ్య అక్కడే వున్నాడా? ఉంటే నోసారి వచ్చి నన్నక్కడకు తీసుకెళ్ళ కూడదూ!

ఇంతే సంగతులు
నమస్కారములతో
సరస్వతి.

ఆ వుత్తరంలో అలావుంది.

ఈమధ్య చంద్రశేఖరం పరీక్షఫీజు కట్టడానికిగాను తాలూకాకు వెళ్ళి డబ్బుచెల్లిస్తుంటే రామశాస్త్రివాళ్ళ వూరివాడే, వో స్నేహితుడు కన్పించి యీమధ్య రామశాస్త్రి

పూర్తిగా మారిపోయాడనీ, అతడి ప్రవర్తనకూడా బాగా మారిపోయిందనీ చెప్పినప్పుడే చంద్రశేఖరం కృంగిపోయాడు. విడమరచి చెప్పుమనటానికి చంద్రశేఖరానికి చిన్నతనమైంది.

అప్పటినుంచీ దాన్ని గురించే ఎక్కువ ఆలోచిస్తున్నాడు. అతడికి తెలిసినంతవరకూ రామశాస్త్రి దుష్ప్రవర్తన కలవాడేమీకాదు ఇదివరలో. చరిత్రహీనుడూకాదు. అల్లరిచేసేవాడు. ఆడపిల్లలతో మాట్లాడాలని పడిచస్తుండేవాడు. అంతే! కాని ఇప్పుడు యీ అనర్థమేమిటి?

రామశాస్త్రి చెడిపోయినాడా?

అలా ఆలోచన వచ్చేసరికే చంద్రశేఖరానికి నిలుచున్నపాటున రోమాంచం కలిగింది.

తానై చెల్లెలిజీవితాన్ని నో తుచ్ఛుడి జీవితంతో ముడివైచాడా? తానే కారకుడా? బంగారాన్ని పెంటకుప్పపై విసరివేయటానికి కారకుడు తానా? గగనధునీవికసితనీలోత్పలమ్మువంటి చెల్లెలిని నో చరిత్రహీనుడి కరస్తము చేసినది తానా? ఇక ఏమి జరుగనున్నది?

ఇప్పటికి ఇంకా ఐదోవంతు జీవితమైనా పూర్తికాలేదే! తక్కిన నాలుగువంతులూ ఎట్లా గడపాలి?

ఈ ఊహాలు అతణ్ణి ముంచివేయటంతో అతడు విచలితుడైనాడు. ఊగిపొయ్యాడు. ఏమీ తోచలేదు. ఎవరికర్మకి ఎవరు కర్తలు అనేవాక్యం అతడిలోని ప్రత్యణువునూ పట్టుకపాలారుస్తున్నది. అత డక్కడ నిలుచుండలేకపోయాడు. తండ్రి ముఖంలోనూ, తల్లిముఖంలోనూ భయాందోళనలు ప్రస్ఫుటమవుతున్నాయి. ఎక్కడచూసినా నిశ్శబ్దం. ఎవరూ పలకరు.

ఆ నీరవ నిస్తబ్ధవాతావరణంలోంచి చంద్రశేఖరం పారి పోయాడు.

కాఫీహోటలులో పోయి కూచున్నాడు.

గ్రామఫోనుమీద ఎప్పటిదో పాతరికార్డు గోలపెడు తోంది. నిన్నటి దినపత్రిక గాలికి టేబిలుమీద రెపరెప లాడుతోంది. అంతా విసుగ్గావుంది.

జోసెఫ్ అప్పుడే కాఫీత్రాగటానికి వచ్చాడు.

"ఏం, అలా వున్నారేం. ఒంట్లో బాగోలేదా?" అని పలకరించాడు చంద్రశేఖరాన్ని.

చంద్రశేఖరం సమాధానంచెప్పకుండా అతడివేపు ఏదో పోగొట్టుకున్నవాడిలా చూచాడు.

జోసెఫ్ చాలా ఆశ్చర్యం పొందాడు.

మారు మాట్లాడకుండా కాఫీ తాగి "స్కూలుకు పోదాం రాండి" అన్నాడు.

చంద్రశేఖరం ఏమీ ఆలోచించలేదు.

అవుననలేదు, కాదనలేదు. లేచి జోసెఫ్‌ను అను సరించాడు.

వాళ్ళు స్కూలుదాకా అలానే నడిచారు.

స్కూలు అప్పుడే విడిచిపెట్టారు. సూర్యనారాయణ శాస్త్రి మధ్యదారిలో వాళ్ళకు కన్పించాడు. కాని వాళ్ళు ఏమీ మాట్లాడుకోలేదు. బడిపిల్లలంతా వాళ్ళాక్కరే ఇండ్లకు వెళ్ళిపోతున్నారు.

బడిఆవరణ దాటి ఇద్దరూ లోపలకు వచ్చారు. ఓ పాత కుర్చీ తెచ్చివేశాడు జోసెఫ్.

చంద్రశేఖరం యాంత్రికంగా కూచున్నాడు.

బడిఆవరణలో బంతిమొక్కలు వేశారు. బాగా ఎత్తు పెరిగాయి బంతిమొక్కలు. అక్కడక్కడా పూలు పూశాయి. ఇంకోవైపు బంగాళాబంతిమొక్కలు వేశారు. అవీ చక్కగా పూలు పూస్తున్నాయి. వాటివేపు చూస్తూ కూచున్నాడు చంద్రశేఖరం. ఇంతలో వెనుకవైపున కోమలమైన కంఠస్వరం వినిపించింది 'నమస్కారం' అని.

చంద్రశేఖరం తలతిప్పి చూశాడు. వాకిట గడపలో మేరీ చేతులుజోడించి నిలుచుని వుంది. ఇవతల జోసెఫ్ నులక మంచం వాల్చి కాళ్ళకట్ల బిగిస్తున్నాడు.

చంద్రశేఖరం ప్రతినమస్కారం చేశాడు. మేరీ అతి సామాన్యంగా వుంది. చామనచాయ అయినా చాల అందంగా వుంది. సొగసైన కండ్లు. ఉన్న ఆకర్షణ అంతా ఆ కళ్ళలోనే వుంది. పొడుగ్గా, సన్నగా చూపులకు చాలా బాగుంది.

జోసెఫ్ అప్పుడు పరిచయంచేశాడు.

"మన సూరినారాయణపంతులుగారితమ్ముడు" అని.

మేరీ తెలుసునన్నట్లు తల పంకించింది.

ఇంట్లోకి వెళ్ళిపోయింది.

"ఏమిటండీ ఎంతోదీర్ఘంగా ఆలోచిస్తున్నారు"అన్నాడు జోసెఫ్.

చంద్రశేఖరం యీ లోకంలోపడ్డాడు.

ఆలోచనలనన్నిటినీ వదుల్చుకుని "మీ స్కూలుకు గదులు సరిపోతున్నాయా?" అని ప్రశ్నించాడు. జోసెఫ్ చెప్పాడు "ఏదో తంటాలుపడుతున్నాం" అని.

చంద్రశేఖరం ఇల్లంతా వోసారి కలయచూశాడు. చాలా అమరికగా వుంది.

ఇంతలో మేరీ వచ్చింది.

"మీకుగూడా అన్నయ్యగారిలా పట్టింపులు లేవు కదా ?" అంది.

చంద్రశేఖరం నవ్వాడు

"కాఫీలో పాలు కలుస్తాయి కాబట్టి తప్పులేదనుకుం టాను. ఏమంటారు?" అంది.

దీనికిగూడా చంద్రశేఖరం సమాధానం చెప్పలేదు.

"పోనీ వొట్టిపాలు పుచ్చుగుంటారా ?" అంది మేరీ.

"నా కా పట్టింపులేమీ లేవు. మీరు మంచినీళ్ళిచ్చినా తాగుతాను" అన్నాడు చంద్రశేఖరం.

మేరీ స్వచ్ఛంగా నవ్వింది. కొంతమంది ఎంతో అందంగా నవ్వుతారు అనుకున్నాడు చంద్రశేఖరం.

"తప్పులేదులెండి. కాఫీకి ఫరవాలేదు" అంటూ మేరీ ఇంట్లోకి వెళ్ళింది.

పదినిముషాల్లో కాఫీగ్లాసు తెచ్చింది.

చంద్రశేఖరం తీసుకున్నాడు.

"మీ దగ్గర ఏవేవో చాలాచాలా పుస్తకాలు వున్నాయనీ, మీకు పుస్తకాలపిచ్చి చాలా యెక్కువనీ. యీయన చెప్పారు. ఓసారి చూడాలని వచ్చాను" అన్నాడు చంద్రశేఖరం.

చంద్రశేఖరం అక్కడ వున్నాడనైనా లేకుండా భర్త వేపు స్నిగ్ధదృష్టులుబరపింది మేరీ.

ఆ చూపుల్లో మెచ్చుకోలు వుంది; ప్రేమ వుంది; "అందరితోనూ మాఆవిడకు పుస్తకాలపిచ్చి, చాలా చాలా పుస్తకాలు చదువుతుంది అని చాటుకోవచ్చునా" అన్న భావం వుంది.

జోసెఫ్ నవ్వాడు.

"ఏదో కొన్ని పుస్తకాలు వున్నాయి. ఎక్కువ లేవండీ. చదువుకునేరోజుల్లో నా మంచిస్నేహితురాలు వుండేది. ఆ అమ్మాయి కథలూ అవీ పత్రికలకి వ్రాసిపంపిస్తుండేది. ఆ అమ్మాయిస్నేహంవల్ల కొంత పుస్తకాలు చదవటమనే మంచి అలవాటు చేసుకున్నాను" అన్నది.

చంద్రశేఖరం కాఫీ తాగేసిన తర్వాత, మేరీ చాలా పుస్తకాలు మోసుకొచ్చి ఎదుటపెట్టింది.

చంద్రశేఖరం వాటిని తిరగేసి చూశాడు.

ఏవో కొన్నిపుస్తకాలు తీసుకుని ఇంటికొచ్చాడు. ఇంట్లో వాతావరణం ఇంకా కలుషితంగానే వుంది. ఏమీ మార్పులేదు.

సోమిదేవి భర్తతో ఏవేవో గుసగుసలు చెపుతోంది. తండ్రి ఇంట్లో లేడు. తల్లి చైతన్యాన్ని కోల్పోయినదానిలా దిగులుగా కూచునివుంది.

చంద్రశేఖరం దగ్గరకుపోయి తల్లివద్ద కూచున్నాడు.

"అమ్మా!" అన్నాడు.

ఆమె ఒకసారి చంద్రశేఖరంవేపు చూసింది ఏమిటన్నట్లు.

ఆమెవొళ్ళో తలవుంచి తన వేదనంతా అణచుకుందా మనుకున్నాడు చంద్రశేఖరం.

"ఎందుకలా వున్నావు?" అన్నాడు.

ఆమె సమాధానం చెప్పలేదు.

చిన్నతనంనుంచీ ఇప్పటిదాకా జీవితంలో ఎన్నో పోరాటాలను ఎదుర్కొన్నది. ఓరిమితో కష్టాలను సహించి దరిద్రం బాధించినప్పుడూ తొణకలేదు. పిల్లల అనారోగ్యం, భర్త అనారోగ్యం, అపాయకర పరిస్థితులు వీటినన్నిటినీ ధైర్యంతో అధిగమించింది.

అప్పుడు ఆమెకు శారీరక బలమూ, మానసిక బలమూ వుండబట్టి, ఆమె కష్టాలను ఎదుర్కోగలిగింది. అదీకాక ఆమెకు వొక ఆశవుండేది. ఎప్పటికైనా యీ కష్టాలు తీరిపోతవి. కొడుకులు పెద్దవాళ్ళవుతారు. కోడళ్ళు వస్తారు. దరిద్రం వుండదు. అప్పుడు ఏ బాధలూ వుండవు. సుఖం, శాంతి, తృప్తి అనుకుంది.

కాని ఆమె ఇవతలిఒడ్డున నిల్చున్నా ముందు జీవితం కూడా శృంఖలాబద్ధమైనదిగా కన్పిస్తున్నది కాని, స్వేచ్ఛ, శాంతి, తృప్తి, సుఖం అనేవి సుదూరాల్లో కన్పించటంలేదు.

ఎప్పుడూ కష్టాలే–

పాతవి పోతవి, కొత్తవి వస్తవి.

ఈ జీవితం అంతా ఇంతే–

ఆమె కొడుకుతో మాట్లాడలేదు. మాటాడదలచలేదు. ఆమెమనసు విరిగిపోయింది. ఆమె అక్కడినుంచి లేచి ఇంటి పనులు చేసుకోటానికి లేచిపోయింది. చంద్రశేఖరం ఆమెవేపు చూసి దిగాలుపడిపోయినాడు.

# 10

కార్తీకం వచ్చేసిందని మసీదులోని పున్నాగచెట్టు చెప్పింది. ఊళ్లో అక్కడక్కడా సాయంకాలం కాగానే ప్రమిదలలో దీపాలు వెలిగిస్తారు. శివాలయంలో కార్తీకమాసపు పూజలు ప్రారంభమైనయ్.

జీవితం వొడుదుడుకులు లేకుండా నడచిపోతున్నది. చంద్రశేఖరం జాగ్రత్తగా చదువుతున్నాడు. ఉత్సాహాన్ని కూడదీసుకుని జీవిస్తున్నాడు.

ఇంట్లో ప్రతివాళ్లూ నిర్లిప్తతో జీవిస్తున్నారు. సోమిదేవి మాత్రం కలలుకంటూ సుదూరాలలోని సుఖదినాలు తలుచుకుని తృప్తిచెందుతున్నది. ఎక్కడో బోసినవ్వులూ, పాలబుగ్గలూ కలలో సాక్షాత్కరిస్తున్నాయి. తాను ఒక్కతె వొంటరిగా కూచుని ఆలోచించేది. సరస్వతికూడా ఇంట్లో లేకపోవటంతో సోమిదేవికి పని ఎక్కువైంది. అత్తగారు ఎక్కడ కూచుంటే అక్కడే కూచుంటుంది. ఏమిటో ఆకాశంలోకి నిర్లిప్తతో చూస్తుంది. కోడలు ఏమిచెప్పినా పట్టించుకోదు. ఎప్పుడూ ఏమిటో దిగులు ఆమెకు.

చంద్రశేఖరం ఇంటివిషయాలు ఏమీ పట్టించుకోవటం లేదు. రాధవాళ్ళఇంటికి ప్రతి సాయంకాలమూ పోయి వోగంట కూచుని చదువుచెపుతున్నాడు. రాధ ఇంటర్‌కి ప్రైవేట్‌గాకట్టి చదువుతున్నది. ఓ పాఠం చెప్పి, వో పాట పాడమంటాడు.

"మీరు నాకు సరిగా పాఠాలు చెప్పటంలేదు మేష్టారూ" అంటుంది రాధ.

అయినా ఓ తరంగమో, అష్టపదో పాడి వినిపిస్తుంది. సంజ పూర్తిగా కమ్ముకుంటుంది.

చంద్రశేఖరం లేచి ఇంటికి వచ్చేస్తాడు.

సూరినారాయణశాస్త్రికి తమ్ముడి ప్రవర్తన అగమ్యంగా వుంది. ఒక్క కానీ సంపాదించడు. ఉట్టినేవుండి ఎక్కడెక్కడో తిరిగి వస్తాడు. ఏంచేస్తున్నట్లు? ఉద్యోగానికి ప్రయత్నమైనా చెయ్యడు.

ఒక సమష్టి కుటుంబంలో అన్నదమ్ములలో ఒక్కరే సంపాదిస్తూవుండివుంటే, సంపాదించనివాళ్ళపై సంపాదిస్తున్న వాడు మామూలుగా అధికారం చెలాయించా లనుకుంటాడు.

ఇది లోకసామాన్యమైన విషయం. అంతేకాని అందరూ అలా వుంటారని కాదు. అది ఈర్ష్య అని చెప్పలేము కాని, సంపాదించేవాడికి వొకవిధమైన బాధవుండటం సహజమే.

సూరినారాయణశాస్త్రికి అలాంటి బాధే పట్టుకుంది. చంద్రశేఖరం చిల్లిగవ్వ సంపాదించకుండా ఎన్నాళ్ళిలా వుంటాడు? అన్నాళ్ళూ సమష్టిగావున్నందువల్ల తనకు బరువు ఎక్కువ కాదా? న్యాయంగా ఆలోచిస్తే చంద్రశేఖరానికి తనకంటే ఎక్కువ చదువే అబ్బింది. చంద్రశేఖరం వయసుకి తా నప్పుడు ఉద్యోగంలో చేరి తండ్రిని ఆదుకున్నాడు. చంద్రశేఖరంకూడా ఏదైనా ఉద్యోగంలో చేరి సరస్వతిపెండ్లికైన అప్పులను తీర్చటానికి ఎందుకని ప్రయత్నించకూడదు? అని అతని భావన.

చంద్రశేఖరాన్ని యీవరలో ఉద్యోగప్రయత్నం చెయ్యమని రెండు మూడుసార్లు హెచ్చరించి వున్నాడు. అప్పుడెప్పుడో రెవిన్యూ డిపార్టుమెంటులో ఖాళీలు కూడా వచ్చాయి. అప్పుడు చంద్రశేఖరాన్ని హెచ్చరించినా వాడు పట్టించుకోలేదు. పైపెచ్చు సోమిదేవి పుట్టింటివైపు తన పిన మామగారు తాసిల్దారుఉద్యోగం చేస్తున్నాడు. గట్టిగా ప్రయత్నిస్తే తమ్ముడికి ఉద్యోగం దొరకవచ్చు అని సూరినారాయణ శాస్త్రి ఆలోచించాడు. తప్పకుండా తమ్ముణ్ణి హెచ్చరించాలని నిశ్చయించాడు.

కాని యీమధ్య చంద్రశేఖరంతో మాట్లాడటాని కత డికి పడటంలేదు. తాను ప్రొద్దుటిపూట స్కూలుకుపోయే తొందరలో వుంటాడు. అప్పటికి ఒక్కొక్కరోజున చంద్రశేఖరం లేవడు. సాయంకాలం తమ్ముడు ఇంట్లోనే వుండడు. పెద్దలతో లోకాభిరామాయణం చర్చించి ప్రొద్దుపోయి ఇంటికి వస్తాడు తాను. ఇక ఎప్పుడూ తమ్ముడితో మాట్లాడటం? పైన తండ్రి ఎదురుగా ఆ విషయాన్ని చర్చించాలని సూరినారాయణశాస్త్రి ఆలోచన. తండ్రి ఎప్పుడో బాగా ప్రొద్దుపోయిన తర్వాతగాని రాడు. ఈమధ్య శెట్టిగారింట్లో రాత్రి భారతం చెప్పటానికి వెళుతున్నాడు.

సూరినారాయణశాస్త్రికి యీ విషయమై ఆందోళనై పోయింది.

సోమిదేవికి యీమధ్య వొంట్లో బాగుండటంలేదు. అది కూడా ఆందోళనగా వుంది సూర్యనారాయణశాస్త్రికి.

సోమిదేవినిచూస్తే జాలికలుగుతుంది అతడికి. ఇంటిపనంతా ఆమే చేయాలి.

ఈమధ్య అమ్మ ఏమీ పట్టించుకోవటం లేదు. రెండు పూటలా మడికట్టుకుని వండి వార్చాలి. సోమిదేవికి విసుగు ఎక్కువైంది. ఇదివరలో ఆ విసుగు ఒక్క భర్తఎదుటనే వ్యక్త పరచగలిగేది. మామగారన్నా, అత్తగారన్నా యత్కించిత్ గౌరవభావమో, భయమో వుండివుండటం మూలాన వాళ్ళ ముందు విసుక్కునేదికాదు. ఇప్పుడు బాహాటంగా అత్తగారి ఎదుటా, మామగారియెదుటా, మరదిముందూ విసుగునీ, కోపాన్ని వ్యక్తపరచటం నేర్చుకుంది.

చంద్రశేఖరం విపరీతంగా బాధపడేవాడు. కుటుంబం లోని వ్యక్తులమధ్య వైమనస్యానికికారణం ఎంత వూహించినా ఎందుకింత పెరిగిపోతున్నదో అవగాహనకావటంలేదు. ఇంట్లోని వ్యక్తులమధ్య సామరస్యం వుంటే బ్రతుకులోని బాధాపూరిత వాతావరణంలోంచి తాత్కాలికోపశమనం పొందటానికైనా అవకాశం కలుగుతుంది.

ఇంట్లో ఎవరిమొహానా సంతోషం కన్పించదు. కానే పైనా చమత్కారంగా మాట్లాడుకోలేరు. కష్టాలను మరచి పోలేరు.

ఒకరోజున సూరినారాయణశాస్త్రి వీలుచూసుకుని తమ్ముణ్ణి నిలవేసి అడిగాడు ఉద్యోగంవిషయం. చంద్రశేఖరం నిష్కర్షగా చెప్పాడు. చదువు పూర్తిచేసుకోంది ఉద్యోగం మాట తలపెట్టనని.

ఆవాళ అన్నదమ్ములమధ్య పెద్ద జగడమైంది. తల్లి

చూస్తూ వూరుకుంది. ఏమీ మాట్లాడలేదు. నిజాని కామె కేమీ తెలీదు. సూరిశాస్త్రి రగడ ఆరంభంకాగానే వీధిలోకి తప్పుకున్నాడు.

ఆ రాత్రి సోమిదేవి భర్తతో ఆ ఇంట్లోంచి వైదొలగుదామని పోరింది. సూరినారాయణశాస్త్రికి నిజానికి సోమిదేవి మాటలు నచ్చినా కసుకసున్నాడు. సోమిదేవి వుత్తప్రుణ్యానికి కళ్ళనీళ్ళు పెట్టుకున్నది. ఆలుమగలు మాటాడుకోలేదు ఆరోజు.

మర్రోజు తల్లిముందు యీ ప్రసక్తి తెచ్చాడు సూరినారాయణశాస్త్రి. ఆమె ఎంతకూ మాటాడలేదు. చివరకిలా అన్నది.

"నేను ఇంకా కొద్దిరోజులే బ్రతికివుంటాను. ఆ తరువాత మీా ఇష్టం."

సూరినారాయణశాస్త్రి ఆ మాటలు విని కంపించాడు. సావిడిలోవున్న చంద్రశేఖరానికి కళ్ళలో నీళ్ళు గిర్రున తిరిగినయ్. ఈ ఇంట్లో సుఖశాంతులు ఎప్పుడు లభిస్తవి? ఈ చీకట్లు ఎలా తొలుగుతవి? అనుకున్నాడు.

చివురింపదా చైత్ర శోభోత్సవ
విభాత కళ్యాణము యీా
దరిద్ర హేమంతమున !

అని కృష్ణశాస్త్రిగారు కామోసు పాడుకున్నారు.

చంద్రశేఖరంకూడా అలానే డగ్గుత్తికతో అవశ్రుతులను గొణుక్కున్నాడు.

సూరినారాయణశాస్త్రి ఇక తల్లితో మాటాడకుండా వెళ్ళిపోయినాడు. అవాళంతా చంద్రశేఖరంమనసేమీా బాగు

లేదు. చదువుకోలేదు. భోజనంసంగతి పట్టించుకోలేదు. మేరీ వద్దనుంచి తెచ్చిన పుస్తకాలు చదువుదామని తీశాడు. కొద్ది సేపు చదివేసరికి విసుగుపుట్టింది. చిత్తశాంతి కరవైంది. వాళ్ళింటికి వెళ్ళివద్దామని బయలుదేరాడు. ప్రొద్దుట ఎనిమిది న్నర అయివుంటుంది. పంతులు యింట్లో వుంటాడా? వుండడా అన్న విషయాన్ని ఆత డూహించలేదు. మఱ్ఱిచెట్టుదాటి వీధి మళుపు తిరుగుతుంటే ఎదురుగా పార్వతి బిందెఎత్తుకుని వస్తు న్నది. క్షణంసేపు చూశాడు. మనసు అదోలా అయి పోయింది. పార్వతిలో రోజు రోజుకీ పెరుగుదల ప్రస్ఫుటంగా కానవస్తున్న దతడికి. పార్వతి నిలిచిపోయింది. రెప్పలు క్రిందికి వాల్చి "సరస్వతేమైనా ఉత్తరాలు వ్రాస్తున్నదా బావా?" అని అడిగింది. ఆ సంబోధనలో నూత్నత్వం వుంది. ఆ పిలు పులో మాధుర్యం వుంది. చంద్రశేఖరం ముగ్ధుడైపోయినాడు. వంచినతలను గడ్డం చేతపుచ్చుకుని ఎత్తి కళ్ళలోకి చూడామని పించిం దతడికి.

పార్వతి వెళ్ళిపోయింది. పార్వతివెళ్ళిపోయిన తర్వాత పార్వతి అడిగిన ప్రశ్న అతడిలో మెదిలింది. చంద్రశేఖరం హృదయకాసారంలో అలలు సుళ్ళు తిరిగినయ్. అతనిముఖం చిన్నపోయింది. కన్నుల్లో కాంతి పోయింది. ఇల్లు గుర్తొ చ్చింది. సరస్వతి గుర్తొచ్చింది. రామశాస్త్రి గుర్తొచ్చాడు. భారంగా నడుస్తూ బడిగేటుదాకా వచ్చాడు. సూరినారా యణశాస్త్రికంఠం బయటిదాకా వినపడుతోంది. చంద్రశేఖ రానికి భయంపుట్టింది. వెనక్కు తిరిగి వెళ్ళిపోదామను కున్నాడు. ఇంతలో వో తియ్యనికంఠం తనని పేరుపెట్టి 'పిలి

చింది. చంద్రశేఖరం వెనక్కి తిరిగి చూశాడు. మేరీ పక్క భాగపు వసారాలో నిల్చునివుంది. చంద్రశేఖరం వెళ్లాడు. మేరీ కుర్చీ చూపించింది. చంద్రశేఖరం కూర్చున్న తర్వాత మేరీయే సంభాషణ ప్రారంభించింది.

"మీరు తర్వాత వస్తారనుకున్నాను. మళ్ళీ ఇన్నాళ్ళదాకా రాలేదే? ఈ ఊళ్లో ఏం పొద్దుపోదు సుమండీ. పుస్తకాలుకూడా దొరకవు. తీసికెళ్ళినవి చదివారా?" అని ఇలానే ఏవేవో ప్రశ్న లడిగింది.

చంద్రశేఖరం ఎక్కువ మాట్లాడలేదు. పంతులు బడికి వెళ్లాడు. తా నక్కడికి రావాల్సింది కాదు. అక్కడినుంచి వెళ్ళిపోతే బాగుండును అని అతడు ఆలోచిస్తున్నాడు.

"మీ వొంట్లో బాగులేదా ?" అంది మేరీ.

చంద్రశేఖరం తలవూపాడు.

"ఇప్పుడే వస్తాను కూచోండి" అని వెళ్ళిపోయింది మేరీ. కాఫీగ్లాసుతో తిరిగి ప్రవేశించింది.

చంద్రశేఖరం తీసుకున్నాడు.

మేరీ నవ్వుతూ "నాకూడా ట్యూషన్ చెప్ప కూడదూ!" అన్నది. చంద్రశేఖరం విభ్రాంతుడైనాడు. అతడి నోట మాట రాలేదు. మేరీ ఇంకా నవ్వుతూనేవుంది. వాకిట్లోంచి పంతులు ప్రవేశించాడు.

చంద్రశేఖరానికి రోతలో కూరుకుపోయినట్లనిపించింది.

"ఓహో చంద్రశేఖరంగారూ! మీ రీమధ్య అసలు కన్పించటంలేదే" అన్నాడు జోసెఫ్.

చంద్రశేఖరాని కెందుకో మనసంతా ఖరాబైంది. అటు

మేరీ అన్న మాటలను ఆలోచించాలో, లేక జోసెఫ్‌కు బదులు చెప్పాలో తెలియని సందిగ్ధంలోపడి ఆలోచిస్తూ కూచున్నాడు. మేరీ కాఫీ తెచ్చి జోసెఫ్‌కుకూడా యిచ్చింది. జోసెఫ్ త్వర త్వరగా కాఫీతాగేసి కూచునుండండి వస్తానని చెప్పి వెళ్లిపోయి నాడు. బడి పక్కనే కావటంవలన అతడికి హాయిగావుంది. చంద్రశేఖరానికి యీ వ్యవహారమేమీ నచ్చలేదు. తనతో బళ్లోకి రమ్మంటాడు జోసెఫ్ అని ఆశించాడు. కాని కూచు నుండండి అని వెళ్ళిపోయాడతను. ఎలాగైనా బయటపడ దామని యోచిస్తున్నాడు చంద్రశేఖరం.

మేరీ ఇంట్లోంచి వచ్చింది.

"నాకు సమాధానం చెప్పారు కాదు?" అన్నది.

చంద్రశేఖరానికి విసుగుపుట్టింది. ఇప్పుడు తను చమత్కారాలను అర్థంచేసుకొని, అనుభవించి, ఆనందించే పరిస్థితులలో లేడు. ఇంతలో మెరుపులాంటి నో ఆలోచన తట్టింది.

"ఇవాళ మీరు బడికి పోలేదేం" అని అడిగాడు మేరీని.

"వొంట్లో బాగులేదు. అందుకని శెలవుపెట్టాను. మీరు రాధ అనే ఆమెకు ట్యూషను చెప్తున్నారా?" అన్నది.

చంద్రశేఖరానికి చిరాకెత్తింది. అనవసరమైన విషయాలలో ఎందుకింత ఉత్సుకత చూపుతారో అతడికి అర్థంకాదు. మేరీకి యీ విషయం ఎలా తెలిసింది? ఎందుకు తెలుసుకుంది? అని చంద్రశేఖరం ఆలోచన. మేరీ మళ్ళీ నవ్వుతూ అన్నది.

"నాకెలా తెలిసిందా, అనా మీ ఆలోచన?"

చంద్రశేఖరానికి భయమేసింది. మేరీ తనను చదువుతున్నది.

"ఆయనే చెప్పారు. మీ అన్నగారిని మీ గురించి నేను అడిగాను, ఎక్కడా కనపడటమే లేదని. మీకు తీరిక లేదట. మీ అన్నగారు చెప్పారు" అన్నది మేరీ.

"వస్తానండీ" అన్నాడు చంద్రశేఖరం.

"కాసేపు కూచోండి. అతడూ వస్తాడుకదా" అన్నది మేరీ.

చంద్రశేఖరం బయట కొచ్చేశాడు.

చంద్రశేఖరం వీధివాకిలి దాటుతుంటే సూరినారాయణశాస్త్రి కన్పించాడు. ముఖం గంటు పెట్టుకున్నాడు. పదడుగులు నడిచాడో లేదో సుబ్బారాయుడు ఎదురైనాడు.

"ఎక్కడినుంచి?" అని అడిగాడు.

చంద్రశేఖరం చెప్పాడు.

"రాధ ఏమంటోంది?"

చంద్రశేఖరానికి మండిపోయింది.

"నాకూ కూడా ట్యూషన్ చెప్పరాదూ. నేనుకూడా రాధవాళ్ళింటికొచ్చి నేర్చుకుంటాను" సుబ్బారాయుడు అసహ్యంగా నవ్వాడు.

చంద్రశేఖరం వాడి వెకిలిమాటలు విధిలేక భరించాలి. పరీక్షఫీజు కట్టటానికి సుబ్బారాయు డిదివరలో సాయంచేశాడు చంద్రశేఖరానికి. చంద్రశేఖరం కోపాన్ని దిగమింగుకున్నాడు.

సుబ్బారాయుడు ఇంకా అసహ్యంగా మాటాడాడు.

"అదృష్టవంతుడివి" అన్నాడు. "నేనైతే పూలుపెట్టి పూజ చేస్తాను. అదృష్టముండాలిలే" అన్నాడు.

ఎలానో వాణ్ణి వదిలించుకున్నాడు.

చంద్రశేఖరానికి యీ మనుష్యులనిచూసి జాలి కలిగింది. మళ్ళీ ఇంతలో అసహ్యం కలిగింది.

దారిలో పార్వతి మళ్ళీ ఎదురైంది.

"పార్వతీ!" అని పిలిచాడు.

"ఏం బావా?" అన్నది పార్వతి చిరునవ్వు దాచుకుంటూ.

"ఇందాక ఏమిటో అడిగావు?" అన్నాడు.

పార్వతి నవ్వింది. "ఏమంత పరధ్యానం!" అన్నది.

"నిన్నుచూసేసరికి పరధ్యానం వచ్చేసింది."

పార్వతి సిగ్గుతో కుంచించుకపోయింది. క్రిందిపెదవి నొక్కిపట్టి నవ్వు దాచుకుంది.

ఇంతలో నీళ్ళకుపోయే ఏ సూరకొక్కొ ఆగి "అప్పుడే మొగుడితో ఏదో మాటాడుతున్నావే పిల్లా!" అని వో విసురు విసిరి నవ్వింది.

పార్వతి అక్కడినుంచి గబగబా వెళ్ళిపోయింది. కాని ఆ సూరక్క అంతటితో పోలేదు.

"మరి పెళ్లెప్పుడయ్యా?" అన్నది చంద్రశేఖరంతో. చంద్రశేఖరం నవ్వి అక్కడినుంచి కదలిపోయినాడు.

పార్వతి అడిగినదానికి సమాధానం చెప్పనేలేదు అని దారంట పదేపదే అనుకున్నాడు. సరస్వతి గుర్తురాగానే మళ్ళీ అతడికి దిగులైంది.

ఇంటికివచ్చేసరికి యీ మధ్య లేనిది తల్లి మడికట్టుకోవ టం చూచాడు. బావిదగ్గర స్నానంచేసి తడిగుడ్డతో వణికిపో తున్నది. చంద్రశేఖరానికి మనసంతా పాడైపోయింది. అసలే పెద్దదైంది. దిగులుతో మరీ బలహీనురాలవుతోంది. ఆమె ఇంక చెయ్యలేదు అని మనసులో అనుకున్నాడు. అయినా దగ్గరకుపోయి మాట్లాడలేక జంకి వూరుకున్నాడు. ఏదైనా మాటాడబోతే ఏదో అఘాయిత్యపుమాట అంటుంది. దాంతో బాధపడాల్సివస్తుంది అని అతడికి తెలుసు.

ఆ మధ్యాహ్నం భోజనాలయ్యేసరికి చాలా ఆలస్య మైంది. అవాళల్లా చదువు సాగలేదు. మనసూ బాగులేదు.

సాయంకాలం రాధవాళ్ళింటికి వెళ్ళాడు.

పదినిముషాలసేపు కూర్చున్నతర్వాత రాధతల్లి వచ్చి చెప్పింది, రాధకు జ్వరంవచ్చిందని. చంద్రశేఖరం ఏదో అడి గేసి అక్కడినుంచి లేచివచ్చాడు. ఎక్కడికి వెళ్ళటానికీ అతడికి తోచలేదు. ఏమిటో వెలితిగా వుంది. అంత వెలితిగా వుంటుం దని అత డూహించలేదు. కాని చాల రోజులనుంచి సాయం కాలపు దినచర్యగా రాధకు ట్యూషన్ చెప్పటం అనేది పొందుపరచబడటంతో ఇవా ళేమిటో కొత్తగాను, వెలితి గానూ వుంది.

అదే చంద్రశేఖరానికికూడా ఆశ్చర్యం కలిగించింది.

వెదురుబద్దలవంతెన వేపు నడిచాడు. మిరపతోటలు, రంగురంగుల బంతిపూలు అతడిదృష్టిని ఆకర్షించాయి. వంతెన దాటిపోయి ఇసుకలో కూచున్నాడు. అలాగే నీళ్ళ

జాలునీ, నీటిపక్షులనీ, దూరంగా అగుపడే సాంధ్యశోభనీ చూస్తూ చాలాసేపు గడిపాడు.

ఆరాత్రి ఎప్పుడూలేనిది తండ్రి చంద్రశేఖరాన్ని పలక రించాడు. భోజనాలముందు కూచున్న తర్వాత, కొంతసేపు ఆలోచించి చంద్రశేఖరాన్ని "పెళ్ళి చేసుకుంటావా ?" అని అడిగాడు తండ్రి. చంద్రశేఖరం ఏమీ సమాధానం చెప్ప లేదు. ఆ విషయంలో ఎవరూ ఉత్సుకత చూపలేదు.

దానివిషయం అలానే వదిలేశారు అందరూ. పక్క మీద చేరి చదువుకుందామని ప్రయత్నించేశాడు చంద్ర శేఖరం. అతడిప్రయత్నం కొనసాగలేదు. తండ్రి అడిగిన ప్రశ్న తలచుకుంటే చాలారోజుల తర్వాత అతడికి నవ్వొ చ్చింది. ఆలోచిస్తూ అలానే నిద్రపోయినాడు.

# 11

సోమిదేవి కూచున్నచోటునుంచి లేవదు. సూరినారా యణశాస్త్రికి ఒక్కపనీచెయ్యదు. సోమిదేవిమాట వేదవాక్య మైంది. ఇంట్లో వున్నంతసేపూ వాళ్ళిద్దరూ ఏమిటేమిటో కబుర్లు చెప్పుకుంటారు.

సోమిదేవి కలలలోనే, కలలతోనే బ్రతుకుతున్నది. ఆమె శరీరంలోనూ, మనస్సులోనూ నూతనమైన మార్పులు కలుగుతున్నాయి. మొహంలో వో వింతకాంతి వచ్చింది. అలసభారాలసమై నడుస్తుంది.

సూరినారాయణశాస్త్రికి ఎప్పుడూ ముందురోజుల గురించే చర్చ ఎక్కువైంది. కొద్దిరోజులలో తమ కుటుంబం

లోకి వో పాపడు రాబోతున్నాడు అనే భావమే అతణ్ణి వివశుణ్ణి చేస్తున్నది.

ఇంట్లో ప్రతివిషయంలోనూ, సోమిదేవిఆధిక్యత ప్రస్ఫుటంగా కనపడుతోంది. తా నొక్కతే చాలా ప్రయోజకురాలైనట్లు, ఆమె ప్రవర్తనలో పదపదమునా వో అతిశయం వెల్లివిరుస్తూంది. ఆమెకు వొక్కటే ఆశయం పట్టుకుంది ఇప్పుడు. ఎలానైనా తాము యీ ఇంట్లోంచి వైదొలగినా, లేక ఇంకో ఊళ్లోకి ఉద్యోగంలోకి పోయినా, ఆమెమనస్సులోని సమస్య ఇట్టే పరిష్కారమైపోతుంది. తనపాపడికి రేపు మొలలో మొలతాడు, మెడలో ఓ గొలుసూ చేయించి పెట్టుకుందామనుకుంటే యీ ఇంట్లోవుండి పెట్టుకోలేను అని ఆమె మనస్సులో వొక విశ్వాసంలాంటి భయం వుంది.

ఆమె మనసుని గాయపరచిన విషయం, ఆ ఇంట్లో తన మొగుడు వొక్కడే సంపాదనపరుడై, తక్కినవాళ్ళంతా అతడి సంపాదనను తనతోసమానంగా కాకపోయినప్పటికీ అనుభవిస్తున్నారే అని.

అందుకని తక్కిన కుటుంబసభ్యులను ప్రతి చిన్న విషయంలోనూ ఎక్కువ కర్కశత్వంతో చూసేది. అందుకని తాను అధికురాలనని వ్యక్తపరచే ప్రవర్తనను పోగొట్టుకోలేకపోయింది.

ఇలా సోమిదేవి ప్రవర్తిస్తుంటే ఎక్కువగా ముసిలామె బాధపడ్డది. తరవాత సూరిశాస్త్రి బాధపడ్డాడు.

చంద్రశేఖరం ఏ విషయాన్నీ పట్టించుకోకూడదనుకున్నాడు.

అలానే కాలం గడచిపోతున్నది.

రోజూ రాధకు ట్యూషన్ చెప్పటం, వారానికో పది రోజులకో జోసెఫ్‌వాళ్ళఇంటికి పోయి, మేరీతోనూ, జోసెఫ్ తోనూ కొంతసేపు కాలక్షేపంచేసిరావటం చంద్రశేఖరంకు అల వాటుగా పరిణమించింది. ఒకొక్క ఆదివారం జోసెఫ్ ఇంట్లో కాఫీతాగి పేక ఆడుకునేవాళ్లు. కాసేపు గ్రామఫోను మీద రికార్డులు వినేవాళ్ళు. కొన్ని రోజులు సాయంకాలం వెదురు బద్దలవంతెనవేపు షికారుగా నడచి వెళ్ళేవాళ్ళు. ఎప్పుడైనా మేరీకూడా షికారు వస్తుండేది. ఊళ్లోవాళ్ళంతా విడ్డూరంగా చూసేవాళ్ళు. అప్పుడప్పుడు నలుగురు చేరినచోటున "కాలం మారిపోతున్నది; ఘోరంగా మారిపోతున్నది" అని చర్చించుకునేవాళ్లు.

ఒకరోజున సూరిశాస్త్రికి బజారులో రామ్మూర్తి కనపడి ఎంతో ప్రాధేయపూర్వకంగా "పార్వతికి పెళ్ళిచెయ్యాలనుకుంటున్నాను. ఈ వైశాఖంలోనైనా చేసితీరాల్సిందే కదా! నువ్వేమంటావు బావా?" అని అడిగాడు.

సూరిశాస్త్రి చాలాసేపు ఏమీ మాట్లాడకుండా,

"వాడియిష్టం కనుక్కో రామ్మూర్తీ! నాకు పరమ సంతోషం" అని చెప్పిపోయినాడు. తదాదిగా సూరిశాస్త్రి వొకటి రెండుసార్లు ఇంట్లో యీవిషయాన్ని చర్చకుపెట్టాడు.

కాని ఎవరూ పెదవి కదల్చలేదు. అంతటితో సూరిశాస్త్రి ఆ విషయం ఎప్పుడూ కదల్చలేదు.

రామ్మూర్తి సూరిశాస్త్రికనపడినప్పుడల్లా ఆశగా చూసేవాడు. కాని సూరిశాస్త్రి రామ్మూర్తికి ఏ విషయమూ చెప్పలేదు.

ఒకరోజు సాయంకాలం చంద్రశేఖరం రాధవాళ్ళింటికని వెళుతున్నాడు. వీధిలో రామ్మూర్తి నిలేసి మా యింటికి వెళదాం రా అని తీసుకపోయినాడు. చంద్రశేఖరానికి వాళ్ళింటికి వెళ్ళటం ఇష్టంలేకపోయినా, రామ్మూర్తి మాట్లాడిన తీరు చూసి వెళ్ళాడు. పెద్దఅరుగుమీద కూచోపెట్టి నిర్మొహమాటంగా అడగదలచుకున్న సంగతి అడిగేశాడు రామ్మూర్తి.

చంద్రశేఖరం తెల్లబోయినాడు.

తలుపుమూల ఎవరో నిలుచున్న అనుమానమైంది అతడికి. సాయంకాలంపూట అప్పుడే విచ్చుకున్న చామంతిపూల వాసనకూడా సోకింది. ఆ నిల్చున్నది పార్వతి అని గ్రహించడాని కాతడి కెంతోసేపు పట్టలేదు.

చంద్రశేఖరానికి ఆకాశంలో ఎటువేపో కొట్టుకుని పోతున్నట్లనిపించింది. ఏమీ చెప్పలేకపోయినాడు.

"అమ్మా, నాన్నా, ఇంకా పెద్దవాళ్ళూ, వాళ్ళుకదా యీ విషయాన్ని నిర్ణయించవలసినవాళ్లు, వాళ్ళను కనుక్కో మామయ్యా" అన్నాడు.

"ముందు నీవు చెప్పు" అన్నాడు రామ్మూర్తి.

చంద్రశేఖరం నవ్వి "పార్వతిని కనుక్కోండి"అన్నాడు. కాసేపు కూచుని లేచి వచ్చేశాడు. ఆ కూచున్న పది నిముషాలలోనే పార్వతికోసం ఆతడికళ్లు చాలాసేపు వెతుక్కున్నై. పార్వతి అతడికి కన్పించలేదు. ఆ రోజంతా అతడి మనస్సు చిత్రమైన అనుభూతులతో నిండిపోయింది.

ఒకరోజున సరస్వతినుండి ఉత్తరంవచ్చింది. వెనుకటి ఉత్తరం లాగానే యీ ఉత్తరంకూడా ఇంట్లో అమితమైన సంచలనాన్ని

లేపింది. మాటమాటకూ సరస్వతి తన బ్రతుకులోని విషాదాన్ని వెళ్ళగక్కింది. తాను ఇక బ్రతకలేననికూడా వ్రాసింది.

ఆ ఉత్తరాన్నిచూసి చంద్రశేఖరం వలవలా యేడ్చాడు. సరస్వతి అలాటి నికృష్టపరిస్థితులలో జీవిస్తున్న కారణాలు ఎలా వచ్చినవో అతడికి అర్థంకాలేదు.

ఆరోజు తల్లి పచ్చిమంచినీళ్లుకూడా ముట్టలేదు. సూరిశాస్త్రి ఇంట్లోనే వుండలేదు.

సోమిదేవి కిదంతా చిత్రంగా కనపడ్డది. అయితే ఆమె మనసులో ఇలా సమాధానం చెప్పుకుంది. "ఇలా జరుగుతుందని నాకేనాడో తెలుసు. రామశాస్త్రినిచూసిన మొదటిక్షణమే అతణ్ణి నేను పూర్తిగా గ్రహించగలిగాను. నికృష్టుడని పసిగట్టాను. వీళ్ళంతా భ్రమసిపోయినారు కాని, నేను చెపితే విన్నారా? మేడిపండుప్రవృత్తి అతడిది. ఇప్పుడు ఆశ్చర్యపడాల్సిన, బాధపడాల్సిన అవసరం లేదు."

సోమిదేవి ఒక్క కన్నీటిబొట్టుకూడా రాల్చలేదు. సూరినారాయణశాస్త్రి వస్తుతః కఠినమైనప్రవృత్తి కలవాడు. అత డన్నాడు: "దానిఖర్మ. అది చేసుకున్నపాపం!" అంతకు మించి అతడు మరేమీ ఆలోచించలేదు. బాధపడనూ లేదు.

చంద్రశేఖరం సాయంత్రంకాగానే ఇంట్లో వుండలేకపోయాడు. లేచి వీధిలోకి వచ్చేశాడు.

అలానే నడచి నడచి వెదురుబద్దలవంతెనదగ్గరకు వచ్చాడు. ఆ కాలవపక్కన అలా ఇసుకలో ఎంతసేపు కూచున్నాడో అతడికే తెలియదు.

వెన్నెల బాగా పైకిప్రాకినతర్వాత అతడికి మైకంవదిలి,

తెలివివచ్చింది. గబగబా ఊళ్లోకి నడకసాగించాడు. అతడికి ఆశ్చర్యమైంది. అంత పొద్దుపోయినదాకా తాను అక్కడ ఎలా వున్నాడు? ఎందుకని వున్నాడు? ఇంతవరకు తనమనస్సు ఏమని ఆలోచిస్తున్నది?

నడుస్తూ నడుస్తూ ఒక్కసారిగా ఆగిపోయినాడు. నరాలన్నీ వొక్కసారి ఝల్లుమన్నాయి. విపరీతమైన భయంపుట్టింది. "షాక్" తిన్నట్లయింది. భయంతో కంపించుకునిపోయి ఒక్కడుగు వెనక్కువేశాడు.

ఇంతలో పరకాయించిచూస్తే బాటలో చచ్చిపడివున్న పాము కన్పించింది. ఏబండిక్రిందనోపడి చనిపోయినట్లుంది. అతడి గుండెఅదురుపాటు ఇంకా తగ్గలేదు. కాని అతడిమనస్సు ఇందాకటినుంచీ ఆత్మహత్యనుగురించి ఆలోచిస్తున్నది. అంత విషాదంలోనూ అతడికి నవ్వువచ్చింది. తప్పుకుని ఊరికేసి నడిచాడు.

చంద్రశేఖరం ఊళ్లోకివచ్చి మసీదుముందుగా నడుస్తూ ఆగిపొయ్యాడు. మసీదులో ఫకీరు ఏదో పాట పాడుతున్నాడు. ఆ పాట భావం చంద్రశేఖరానికి అర్థంకాకపోయినా, అతడు అక్కడినుండి ముందుకు సాగలేకపోయినాడు. ఆ ఫకీరుగొంతు చాలా మధురంగా వుంది. ఆ పాటలోని భావం భగవంతుడి ముందు భక్తునియొక్క ఆత్మనివేదన అని చంద్రశేఖరానికి తెలిసిపోయింది. ఎంత బాధగా ఆలాపిస్తున్నాడు? అనుకున్నాడు.

అనుకోవటమే తడవుగా వెళ్ళి పక్కన కూచున్నాడు. ఫకీరు పక్కకుతిరిగి చూశాడు. చిరునవ్వుతో పలకరించాడు. చంద్రశేఖరం ఆ బాబాను ఇదివరలోనే యెరిగివున్నాడు. ఆ

బాబా సంవత్సరంలో ఎప్పుడో వచ్చి యీ ఊళ్లో కొన్నాళ్లు వుండి వెళ్ళిపోతాడు. ప్రతిసంవత్సరమూ అంతే. చాలా మహిమలు కలవాడు. ప్రజలందరికీ అతడంటే ప్రీతి. తత్వాలు ఎంతో చక్కగా పాడతాడు. తెలుగుపాటలుకూడా వచ్చు నతడికి.

బాబా పాట ఆపి వేసి "ఏం నాయనా, ఇలా వచ్చావు?" అని అడిగాడు.

చంద్రశేఖరం మాట్లాడలేదు. బాబా ఇంకొక పాట ఎత్తుకున్నాడు. తనలో తానే తన్మయుడై పోతున్నాడు. చంద్రశేఖరం ఆశ్చర్యపోయినాడు. ఫకీరుబాబా పాట ఆపి వేసి "ఎందుకోయీ యీ చింత, అన్నీ ఆయన పాదాలముందు అర్పించి నువ్వు శాంతిపొందరాదూ" అన్నాడు.

బాధపడే హృదయాలకు వేదాంతం శాంతినిస్తుంది. నిజంగా వాళ్ళకు వేదాంతం వో ప్రిస్క్రిప్షన్ వంటిది. బాబా ఇంకా చెప్పుకపోతున్నాడు. "చూడు నాయనా, ఆ మహానుభావుడు ఎంత మధురంగా వ్రాశాడో...

"ఓ, ఖుదా! (భగవంతుడా) నా ఆత్మను నీ ఎదుట కప్రంవలె వెలిగిస్తాను, నాకు చిత్తశాంతిని ప్రసాదించు. ఆహా... ఆహా..." బాబా భక్తిపరవశుడై పోతున్నాడు.

చంద్రశేఖరం చెప్పాపెట్టకుండా లేచివచ్చేశాడు. బాబా కూచోమనలేదు. అప్పుడే వెళుతున్నావెందుకూ? అని అడగదూ లేదు. మరోపాట యెత్తుకున్నాడు.

చంద్రశేఖరం యింటికి వచ్చేదాకా బాబా పాట మనసులో తిరుగుతూనే వుంది. బాబా మాటలు కలవర

పెడుతూనే వున్నాయి. తల్లి తనకోసం ఎదురుచూస్తూ కూచుని వుంది. తల్లిని చూడగానే చాలా దిగులైంది చంద్రశేఖరానికి. వాళ్ళు ఏమీ మాట్లాడుకోలేదు. భోజనంముందు కూచున్న తర్వాత తల్లి అంది.

"రేపు నువువెళ్ళి సరస్వతిని తీసుకురా" అని.

చంద్రశేఖరం తల వూపాడు. అతడు పక్కమీదచేరి పడుకున్న తర్వాత సెట్టిగారింటినుంచి తండ్రికంఠం దూరంగా తేలివస్తూ ఇలా విన్పించింది.

"తన ధర్మమే తనకు తోడునీడై నడచివచ్చు..." అతడు ఆ కావ్యాన్ని మననంచేశాడు. ఏమాత్రం అర్థంలేదనుకున్నాడు. అతడికి బాగా నిద్రపట్టినదాకా సెట్టిఇంట్లో తండ్రి చదువుతున్న భారతంలోనిపద్యాలు వినవస్తూనే వున్నాయి.

ఆ మర్రోజున సరస్వతిని తీసుకవద్దామని ప్రయాణమైతే అతడికి డబ్బు సమకూడలేదు. పగలంతా పన్నెండుగంటలదాకా తిరిగివచ్చాడు. ఎక్కడా దొరకలేదు.

ఇంటికి వచ్చేసరికి పంచలో సూరినారాయణశాస్త్రి, మేరీ ఏవో స్కూలువిషయాలు మాట్లాడుకుంటున్నారు.

మేరీ అడక్కుండానే చెప్పింది.

"స్కూల్లో ఇన్‌స్పెక్షనట, ఏవో రికార్డులూ అవీ చూసుకోవటానికి వచ్చింది."

చంద్రశేఖరం ఏమీ మాట్లాడలేదు. సోమిదేవి నడిమింటోనుంచి వీళ్ళవేపే చూస్తూ కూచునుంది. మేరీ మళ్ళీ స్కూలుకైమయ్యేవేళకు వెళ్ళిపోయింది.

చంద్రశేఖరానికి పరీక్షలు దగ్గరకొస్తున్నాయి. అతడికి

చిత్తశాంతి కరవవుతున్నది. ప్రతి చిన్నవిషయానికీ బాధపడు తున్నాడు.

మర్రోజుకూడా ప్రయాణం పడలేదు.

మేరీ మర్రోజుకూడా వచ్చింది. చంద్రశేఖరం మేరీతో ఏమీ మాట్లాడలేదు. ముభావంగానే వుండిపోయినాడు. సోమి దేవి ఆ రోజంతా చిర్రుబుర్రులాడింది. మేరీని తలచుకుంటేనే సోమిదేవికి అసహ్యం. పైపెచ్చు ఆమె యింట్లోకివచ్చి కూచుంటే సూరినారాయణశాస్త్రి ఆమెకు మర్యాదచేయటం ఆమె కేమీ బాగులేదు. మేరీ వేషభాషలూ, ప్రవర్తనా—అంటే ఇంకో మగవాడితో జంకూగొంకూ లేకుండా మాట్లాడటం, ఇత్యాది విషయాలు సోమిదేవికి వెకిలిగా కన్పించాయి.

ఆరోజు తల్లి చంద్రశేఖరాన్ని "మరి ఎప్పుడు వెళ తావు?" అని అడిగింది.

చంద్రశేఖరం "రేపు" అని చెప్పాడు.

చంద్రశేఖరం మర్రోజు ప్రయాణమైనాడు.

అతడిమనసంతా ఆందోళనగా వుంది.

సరస్వతి ఎలా వుంటుంది? బాగా చిక్కిపోయి వుంటుందా? పోగానే ఎలా పలకరించాలి. తనను ఎలా పలక రిస్తుంది? ఏడుస్తుందేమో! చంద్రశేఖరం వణికిపోయినాడు.

రైలు దిగి రెండుమైళ్లు నడచి వెళ్ళాలి. నడచి వెళ్ళాడు. బిక్కుబిక్కుమంటూనే ఇంట్లోకి వెళ్ళాడు.

సరస్వతిని చూడగానే అతడికి బావురుమని యేడవా లనిపించింది. సరస్వతిలో వెనుకటి కళాకాంతులు ఏ కోశానా లేవు. చిక్కి సగమైంది.

ఇంటినిండ చిన్నపిల్లలు గోలగోలగా తిరుగుతున్నారు. సరస్వతి ఏమాత్రం సంతోషం వ్యక్తపరచకుండా, మర్యాద కన్నట్లుగా చెంబుతో నీళ్ళు తెచ్చిచ్చి "బావున్నారా అంతా" అన్నది. చంద్రశేఖర్రానికి ఏం మాట్లాడటానికి తోచలేదు. సరస్వతికి కనపడకుండా వుండేందుకని తలవంచుకుని కన్నీళ్ళు ఆపుకున్నాడు. సరస్వతి మారుమాట్లాడకుండా ఇంట్లోకి వెళ్ళి పోయింది.

అతడక్కడ చాలాసేపు కూచున్నాడు. సరస్వతి అటు వేపుకే రాలేదు. మధ్యాహ్నం రామశాస్త్రి ఇంట్లో అడుగు పెడుతూ బావమరది వేపు చూసి కళ్ళు చిట్లించి, తల వూగించి, పలకరించాడు. చంద్రశేఖరానికి అతడివేపు చూడాలంటేనే అసహ్యమైంది. మాట్లాడలేదు.

ఆ సాయంకాలం వెళ్ళిపోదామనుకున్నాడు మొదట. సరస్వతిని ఎలా మాటాడించాలో తోచలేదు అతడికి. భోంచేసి వెంటనే రామశాస్త్రి వెళ్ళిపోయాడు. సాయంత్రం అతడు కన పడతాడేమోనని చూశాడు చంద్రశేఖరం. కాని కనపడలేదు. ఊళ్లోకి అలా షికారు వెళ్ళివస్తుంటే చిన్ననాటి మిత్రు డొకడు కన్పించాడు వీధిలో. ముందు అతడే గుర్తించాడు చంద్రశేఖ రాన్ని. వాళ్ళిద్దరకూ వోసారి, ఏదో పుణ్యక్షేత్రంలో వుత్సవ సమయంలో ఆ స్నేహంకలిసింది. గుప్తంగా వాళ్ళహృదయా లలోవుంది ఆ స్నేహం. చంద్రశేఖరానికి సంతోషమైంది.

అతడు తమఇంటికి పోదాం రమ్మని తీసుకవెళ్ళాడు. అతడిఇల్లు రామశాస్త్రిఇంటిప్రక్కనే అవటం మూలాన

చంద్రశేఖరం వాళ్ళింటికి వెళ్ళి కూచున్నతర్వాత హృదయంలో చాలా కించపడ్డాడు.

మిత్రుడు ఏవో కుశలప్రశ్నాదికం కావించినతర్వాత "ఈ ఊళ్లో బంధువు లెవరు?" అని అడిగాడు.

చంద్రశేఖరానికి చెప్పక తప్పిందికాదు.

మిత్రునిముఖం బాధతో ముడుచుకపోయింది.

అతడు భార్యను కేక వేసి పిలిచాడు.

ఆ అమ్మాయి నవ్వుతూ వచ్చింది.

ఆ అమ్మాయిని ఎక్కడో చూసినట్లనిపించింది చంద్రశేఖరానికి. ఆలోచనతో నిండిపోయింది అతనిమెదడు. ఎక్కడో రైలుప్రయాణంలో చూసిన గుర్తొచ్చింది.

"మూడురోజులక్రిందట ఆయన పశువులా ప్రవర్తించాడు కదూ?" అని అడిగాడు ఆ మిత్రుడు తన ఇల్లాలిని. ఆమె తలవూపింది.

చంద్రశేఖరంహృదయంలో శూలంపెట్టి పొడిచినట్లయింది.

"మీబావ మనిషికాడు" అన్నాడు మిత్రుడు.

చంద్రశేఖరం అవమానభారంతోనూ, బాధతోనూ రసాతలానికి కృంగిపోయినాడు.

ఆ మిత్రుడు ఎన్నో చెప్పాడు. రామశాస్త్రి ఇల్లాలిమీద చెయిచేసుకొనేవ్వాడు, విచక్షణచూపకుండా హింసిస్తాడు అని మిత్రుడినోటివెంట విన్నప్పుడు చంద్రశేఖరంకళ్ళవెంట జోట జోట అశ్రువులు ప్రవహించాయి.

మర్రోజే చంద్రశేఖరం ఇంకోవారంరోజుల్లో వచ్చి తీసు కెళతానని సరస్వతితో చెప్పి పరీక్షలకని వెళ్ళిపోయాడు.

అతడు పరీక్షలలో సంతృప్తికరంగా వ్రాయలేకపోయి నాడు. జీవితమే పెద్ద పరీక్షగా అతడిని భయపెడుతున్నది.

సరస్వతిని తీసుకుని ఇంటికి వచ్చేరావటంతోనే ఇంటి దగ్గర మార్పులనుచూసి ఆశ్చర్యపడ్డాడు. సరస్వతిని చూడ గానే తల్లి కళ్ళనీళ్లుబెట్టుకున్నది. సోమిదేవిని పుట్టింటివాళ్ళు వచ్చి పురిటికి తీసుకపోయినారు. ఇంట్లో తల్లే అన్నిటిని భరిస్తూ వండి వారుస్తోంది.

సరస్వతి ఎవరితోనూ పలుకదు. నిశ్చలంగా ఎక్కడ కూచున్నది అక్కడే కూచుండిపోతుంది. ఆమె నెవరైనా పలక రించినా మౌనంగానే వుండిపోతుంది. కళ్ళలో ఏదో కరడు గట్టిన దైన్యం, మళ్ళీ ఇంతలోనే నిశ్చలతరంగులు మార్చుకుం టుంటాయి.

చంద్రశేఖరానికి ఇంకో విషయంకూడా తెలిసింది. రామ్మూర్తిమామయ్యా, అత్తయ్యా అభిమానాన్ని చంపు కుని తమఇంటికి వచ్చి అడిగిపోయినట్లూ, తన అన్న కేవలం విముఖుడై యీ సంబంధమేగనక తనతమ్ముడు చేసుకుంటే, తనూ తనకుటుంబమూ వేరుపడిపోయేట్లూ నిష్కర్షగా చెప్పాడట. చంద్రశేఖరానికి దిగులైంది. తప్పక పార్వతిని తన ఇల్లాలినిగా చేసుకోవాలనే స్థిరనిశ్చయం చేసుకున్నాడతను. తన అన్న వేరైతే అవుతాడు, అవనీ అనుకున్నాడు.

కాని ఆ నిశ్చయాన్ని హృదయంలో దృఢంగా ప్రతి ష్ఠించుకోలేకపోయినాడు. ఎన్నో ఆలోచనలతో సంశయా

త్ున్నడై విధినీ, అదృష్టాన్నీ నిందించుకుంటూ కాలం గడుపు తున్నాడు.

ఇది ఇలావుండగా సరస్వతికి మధ్యమధ్య "ఫిట్సు" వస్తున్నాయి. రోజురోజుకీ కళాకాంతులు తగ్గిపోతున్నాయి.

జీవితం ఇంత యాతనామయంగా తయారైనదేమా అని గంటలతరబడి ఆలోచిస్తాడు. కాని ఆ ఆలోచనలకు దరీ-దోవా కన్పించవు. అతడుకూడా మానసికంగా చాలా బలహీనుడై పోతున్నాడు.

# 12

ఆర్థికమైన ఇబ్బందుల మూలకంగా సరస్వతికి మంచి మందులు ఇప్పించాలన్నా వాళ్ళకు చేతకాకుండా వుంది.

చంద్రశేఖరం ఏదేనా ఉద్యోగప్రయత్నం చేద్దామను కుంటాడు. కాని అదీ అగమ్యంగావుంది అతడికి. ఇదివరలో కాలక్షేపమన్నా అయ్యేది. ఇప్పుడు ఎప్పుడూ వ్యథితచిత్తం తోనే గడపవలసివస్తున్నది.

రాధవాళ్ళుకూడా ఊళ్లో లేరు.

ఒకరోజు విచిత్రంగా రాధవద్దనుండి ఉత్తరం వచ్చింది చంద్రశేఖరానికి. వాళ్ళు మద్రాసులో వుంటున్నారట. ఆ ఉత్తరంలో సగం పార్వతినిగురించే వ్రాసింది. పార్వతిని తాను రెండుమూడుసార్లు కలుసుకుందిట. పార్వతిహృదయాన్ని తాను విప్పి చదవగలిగిందట.

ఇంకా దాంట్లో ఎన్నోవిషయాలు వ్యంగ్యంగా ధ్వనిం చాయి చంద్రశేఖరానికి. అతడిమనస్సుకి ఆ ఉత్తరం ఏ

మాత్రం పూరట కల్పించలేకపోగా విసుగునలనీ, భయాన్ని పెంపొందించి ఆత్మశాంతిని మభ్యపరచింది.

నెలరోజులు గడిచీ గడవకముందే రామశాస్త్రి పూడి పడ్డాడు. ఆ సాయంకాలమే సరస్వతిని ప్రయాణంచేశాడు. అత్తగారు కళ్ళ నీళ్లుపెట్టుకుని ఇంకో నెలరోజులు వుంచితే బావుంటుందని చెప్పినా, అతడేమీ చలించలేదు. చంద్రశేఖరం అడిగాడు. "పోనీ పదిరోజులుండి వస్తుంది. ఇప్పుడిప్పుడే శాస్త్ర కోలుకొంటున్నది" అన్నాడు. రామశాస్త్రి శాస్త్ర శాస్త్ర మెత్తబడి సరే అనే ధోరణికి దిగజారుతుండగా అంతా విస్తుపోయేట్లు సరస్వతి ప్రయాణానికి సిద్ధమై 'నేను వెళతాను' అన్నది.

"వదిన ఇంకో పదిరోజుల్లో వస్తుందికదు సరూ"అన్నాడు చంద్రశేఖరం. సరస్వతి ఆ మాటలేవీ వినిపించుకోలేదు. చంద్రశేఖరం బ్రతిమాలి, బామాలి భంగపడ్డాడు. సరస్వతికి తెలిసిన వైద్యుడిచే మందు లిప్పిస్తుంటే ఇప్పుడిప్పుడే జీవకాంతులు మళ్ళీ వొంట్లోకి చేరుకుంటున్నాయి.

మూర్ఛలుకూడా ఇదివరలో వచ్చినంత త్వరత్వరగా రావటం లేదు. ఉధృతంకూడా తగ్గింది. కాసేపు చైతన్యం తప్పినట్లున్నా తనంతతానే కోలుకుంటున్నది. సరస్వతి వెళ్ళిపోతాననటం చంద్రశేఖరాని కెంతేని వ్యథ కలుగజేసింది.

అతడు వైద్యుణ్ణి కనుక్కున్నాడు.

వైద్యుడు చెప్పాడు. "అన్నిటికంటే మానసికశాంతి ముఖ్యం. తరువాత ఆ వాతావరణంనుండి కొన్నాళ్ళపాటు దూరంగా వుండాలి. తీరని మనోవాంఛలవల్ల మానసిక దౌర్బ

ల్యంతో మనుష్యులకు అపస్మారలక్షణాలు ఏర్పడతాయి. ప్రతివ్యక్తీ వాంఛనీయంగా కాంక్షించే సుఖాన్నుండి వంచితు లైతే, వంచితురాలైతే సున్నితమైన మనస్సు కలవాళ్లు, భూత కాలంలో కలలు పండించుకున్నవాళ్ళూ, ఇలాంటి జబ్బులకు గురిఅవుతారు."

చంద్రశేఖరం దిగ్భ్రమ చెందాడు.

సరస్వతి సంసారసుఖంనుండీ, శాంతినుండీ వంచితురా లైనదా?

ఓసారి ఎప్పుడూ మాటాడకుండా కూర్చోటం అలవర్చు కున్నది, తన ఆడబిడ్డను గురించి ఏమేమో చెప్పింది.

చంద్రశేఖరం బయటగదిలోంచి విన్నాడు.

"పురుడుపోసి, తల్లినీ బిడ్డనీ దిగవిడిచిరావటమూ, మళ్ళీ వెంటనే ఐదారు నెలలలోనే పురిటికని రావడమూ ఆడబడుచుకి అలవాటైంది."

ఇలా అంటే బాగుండిపోను.

ఇంకా అసహ్యంగా కూడా అన్నది.

చంద్రశేఖరం తనచెల్లెలు అంత అసహ్యకరంగా మాట్లాడుతుందని ఏనాడూ అనుకోలేదు. ఆడపుటక పుట్టిం దేనా! అన్నంత అసహ్యపడ్డాడు. సరస్వతిమనస్సు ఎంతమారి పోకపోతే అలా మాటాడగలుగుతుంది. ఈర్ష్యా, అసూయా, అసహనం, బాధా, ఓర్వలేనితనం, వీటన్నిటికీ కారణం సర స్వతి కోరుకున్న సుఖాన్ని, న్యాయంగా పొందవలసినసుఖాన్ని ప్రతివ్యక్తీ జీవించినందుకు కనీసం పొందవలసిన సుఖాన్ని పొందలేకపోవటమే. అందుకనే అంతటి విశుద్ధహృదయంకూడా

మానవబలహీనతలని పెంపొందించుకుని చివరి కిలాటి దుర్గతికి దిగజారవలసివచ్చింది. సరస్వతి శాపగ్రస్తురాలిలా జీవించవలసి వస్తున్నది. ఆమె కళకళలాడుతూ జీవితంలో ప్రవేశించింది. కాని హతాశయైంది. ఆమె నోడిపోయింది. రిక్తకాంతులతో ప్రోడువారిపోయింది.

సరస్వతి రామశాస్త్రితో వెళ్ళిపోయింది.

చంద్రశేఖరం పిచ్చివాడిలా ఆవాళ ఊరంతా తిరిగాడు. అతడి అంతరాంతరంలో పార్వతి కనిపిస్తుందేమోనన్న అవ్యక్తమైన ఆశ మెదిలి తిరిగాడు. కాని పార్వతి కనబడలేదు. చిత్రమేమిటంటే సరస్వతి పుట్టింటికి వచ్చినతర్వాత వొక్కసారి కూడా పార్వతిని కలుసుకోలేదు. అసలు కలుసుకుందామని ఉత్సహించనుకూడా లేదు.

అతడలా వెఱ్ఱిగా తిరుగుతుంటే సోడాలమ్ముకునే నారాయణ పలకరించాడు. "ఇందాక రైల్లో మీ బావా, చెల్లెలూ వెళ్ళిపోతుంటే స్టేషనుకేనా రాలేదేంటండీ" అని అడిగాడు.

చంద్రశేఖరం అతడికి సమాధానం చెప్పలేదు. మశీదులోవుండే బాబా కన్పించాడు. సుబ్బారాయుడు కన్పించి రాధనుగూర్చి అడిగాడు. జోసెఫ్‌కూడా కన్పించి "మా ఇంటి వేపోసారి రాకూడదూ" అన్నాడు. చంద్రశేఖరం ఎవరితోనూ మాటాడలేదు. చెడ తిరిగాడు. సాయంకాలానికి ఇల్లుచేరుకునేసరికి ఇల్లంతా బావురుమంటున్నట్లనిపించింది. అతడికి ఆరోజు దేనిమీదా ధ్యాసకలగలేదు. ఎంతో ప్రొద్దుపోయినదాకా నిద్రపట్టలేదు. తండ్రిగొంతు మామూలుగా, అతిసహజంగా శెట్టిగారింటినుంచి వినపడుతుంటే అమితమైన ఆశ్చర్యం ముంచు

కొచ్చింది అతణ్ని. "తనధర్మమే తనకు తోడునీడై నడచివచ్చు" అని ఎన్నాళ్ళనుండో పారాయణంచేస్తున్నాడు.

తండ్రికి యీ బాధలు లేవా? లేక వీటినిగురించి ఆయన ఆలోచించడా? ఇవాళ సరస్వతి మొగుడివెంట వెళ్ళిపోయింది. అలా వెళ్ళిపోవటం ఇంట్లో ఎవరికీ సంతోషదాయకం కాదు. అయినా ఎవరిపనివాళ్ళు చూసుకుంటూ కాలాన్ని గడుపుతున్నారు. సూరినారాయణశాస్త్రి—తనఅన్న అతిసహజంగా వున్నాడు. వీళ్ళందరినీ చూస్తుంటేనే చంద్రశేఖరానికి ఆశ్చర్యం కలుగుతున్నది.

చంద్రశేఖరం చాలాసేపటిదాకా నిద్రపోలేదు. వేకువ జామున ఎప్పుడో అతడికి నిద్రపట్టింది.

అలానే మామూలుగా కాలంగడచిపోతున్నది. సూరి నారాయణశాస్త్రి శెలవుపెట్టి అత్తగారింటికి వెళ్ళి రెండురోజు లుండి వచ్చాడు. సోమిదేవికి పురుడువచ్చింది. సూరినారా యణశాస్త్రికి మగపిల్లవాడు పుట్టాడు. చంద్రశేఖరానికి అవాళ మనస్సులో కాసంత ఉత్సాహం వచ్చింది.

పిల్లవాడికి మూడోనెల రావటంతోటే సోమిదేవి బిడ్డణ్ణి ఎత్తుకునివచ్చింది. ఈలోపున చంద్రశేఖరం పరీక్ష మళ్ళీ ఓసారి తప్పటం జరిగింది. సూరినారాయణశాస్త్రి తమ్ముణ్ని తుస్కార భావంతో చూశాడు ఆరోజు. చంద్రశేఖరానికి కన్నులనిండా నీళ్లు కమ్ముకొచ్చినయ్ ఆరోజున. అయినా యీసారి అతడంత ఎక్కువగా బాధపడలేదు. అతడికీవరకే తెలుసు. తానెలాగూ పరీక్షకాలేడని. తాను ఒక సంధికాలంలో జీవిస్తున్నాడు. చీకటిలో నిల్చుని వేకువ తెలిరేకలకై ఆయాసపడుతూ ఎదురు

చూస్తున్నాడు ఉపస్నుని కౌగిలించుకుందామని పరుగులెత్తు తుంటే చీకటి దట్టంగా క్రమ్ముకుంటున్నలాగైంది అతడి బతుకు. సూరినారాయణశాస్త్రి ఊళ్లో ఎవరితోటో "బోగంవాళ్ళింటి కెళ్ళి ఏకచక్కాలాడుతుంటే ఏం పరీక్షలు ప్యాసవుతారు. అసలు కావాలని వుంటేగదూ. సంపాదించిపెడుతుంటే తెలీ దులే" అన్నాడట. అది చంద్రశేఖరం చెవులదాకా చేరింది. చంద్రశేఖరం అసహ్యంతో భూమిలోకి కూరుకునిపోయినాడు. అన్నగారంటే విపరీతమైన జుగుప్స కలిగింది

వదిన వచ్చీరాగానే అభిమానంతో పలుకరించాడు. పొత్తిళ్ళలోని బిడ్డణ్ణి తీసుకున్నాడు. కాని వదిన ముఖభావా ల్లోనూ, ప్రవర్తనలోనూ వైరుధ్యం చూడలేకపోయినాడు. ఎప్పటిలాగానే వుంది ఆమె అనుకున్నాడు.

ఇప్పుడు ఇంట్లో కాస్త కాలక్షేపం అవుతున్న దతడికి. ప్రొద్దస్తమానం సోమిదేవి పిల్లవాడికి ఏవో పాటలుపాడుతూ వుంటుంది. ఓమూలగా నులకమంచం వాల్చుకుని వింటుంటాడు చంద్రశేఖరం.

గతంలోనూ, వర్తమానంలోనూ భవిష్యత్తులోనూ అతడిమనస్సు విహరిస్తుంటుంది. నిలకడలేకుండా ఏమిటేమిటో ఆలోచిస్తుంది మనస్సు.

ముందేం జరుగుతుంది? ఎలా బ్రతుకుతాడు? సరస్వతి ఎలా బ్రతుకుతుంది? వీళ్ళంతా ఎలా బ్రతుకుతారు? వీళ్ళంద రికీ చిత్తశాంతి ఎలాలభిస్తుంది అని ఆలోచిస్తుంటాడు. ఇంతలో—

"ఎంతో ఎత్తూ మరగీనావూ ఏమిచేతురా
ఇంతులచేతీ కాకకు నీవూ ఎంతో కందితివి

రామా లాలీ, మేఘశ్యామా లాలీ"

అని వదినగారి మధుర మంద్ర కంఠస్వరం వినపడి అతడి ఆలోచనలన్నీ చెదరిపోతవి.

అంత మార్దవమైనకంఠస్వరం కలిగిన వదినకి, మనసు కూడా మెత్తనిది కాకూడదూ అనిపిస్తుం దతడికి. అలానే మబ్బుల్లోకి చూస్తూ ఆలోచిస్తాడు.

ఈమాత్రం శాంతికూడా లేకుండా సోమిదేవివచ్చిన వారంరోజులకు ఇంట్లో కలహం చెలరేగింది. సోమిదేవి అవాళ్ళా శోకాలుతీసింది. సూరినారాయణశాస్త్రి దాచిన మూడు వందలరూపాయలు పెళ్ళాం పుట్టింటికి వెళ్ళేప్పుడు పెళ్ళాందగ్గరే వుంచాడు. అవి సోమిదేవి ఇప్పుడు తీసుకునిరాలేదు. గట్టిగా అడిగాడు సూరినారాయణశాస్త్రి. "అవసరానికి మావాళ్ళు వాడుకున్నారు. అవసరాలనేవి ఎవరికిమాత్రం రావా. అయినా ఏం మింగిపోరులే" అని రెట్టించింది సోమిదేవి. దాంతో సూరినారాయణశాస్త్రికి అరికాలిమంట నెత్తికెక్కింది. స్వతహాగా సూరినారాయణశాస్త్రి లోభి. పైపెచ్చు భార్య పుట్టింటివారిని సమర్థించటం మరీ వెర్రెత్తించింది. తాను తమ్ముడు దీనంగా పరీక్షకు కట్టుకోవాలని అడిగినప్పుడుకూడా ఇవ్వలేకపోయినాడు. ఇప్పు డందరికీ తెలిసిపోయింది. సూరినారాయణశాస్త్రికి అప్పుడనిపించింది. సోమిదేవికి తన తల్లీ తండ్రీ ఎట్లానో తనకూ తన తల్లీ తండ్రీ తమ్ముడూ అంతేగదా- తాను ఎందుకు తన వాళ్ళకు ఇవ్వలేకపోయినాడు. ముఖ్యంగా సోమిదేవిమీాద కోపం తెప్పించిన దా విషయమే. ఇంతవరకూ సోమిదేవిని

వల్లెత్తిమాటనని సూరినారాయణశాస్త్రి దారుణంగా మాట లన్నాడు. కొట్టవచ్చినంతపనిచేశాడు.

సోమిదేవి అవాళంతా అన్నంకూడా ముట్టలేదు. ఆ సాయంకాలం మేరీవచ్చి భర్తతో మాటాడిపోవటం సోమిదేవికి మరీ కంటగింపైంది.

రాత్రిపూట సోమిదేవి విజృంభించింది.

సూరినారాయణశాస్త్రి మేరీతో సంబంధంపెట్టుకో జూస్తున్నాడనీ, తనబ్రతుకంతా ఇకకడగండ్లపాలేననీ వాచ్యంగా పలికింది. కళ్ళవెంట కడివెడు కన్నీరు కార్చింది.

ఇప్పటిదాకా సూరినారాయణశాస్త్రి కోపంతోనే వున్నాడు. కాని సోమిదేవి అలా మాటాడేసరికి భయపడి పోయినాడు. వెలితిపాలైపోతాననీ, మర్యాదకాస్తా మంటగలిసి పోతుందనీ నోరు నొక్కుకున్నాడు.

చంద్రశేఖరం విపరీతమైన అసహ్యంతో కుంచించుక పోయినాడు. ఇక తాను ఆ ఇంట్లో వుండలేనని పదేపదే అను కున్నాడు. ఎటేనా పోయి బ్రతుకుదామనుకున్నాడు.

ఆ కోరిక మనసులో క్షణక్షణానికీ ప్రబలమైపోయింది. పోయేలోపున ఒక్కసారి పార్వతినిచూసి, మాటాడిపోవాలని అతడిమనస్సు పదేపదే కాంక్షిస్తున్నది. అది చాలు అతడికి.

ఓ మునిమాపు సంధ్య పనిగట్టుకుని రామ్మూర్తి మావయ్యవాళ్ళింటివేపు వెళ్లాడు చంద్రశేఖరం. వాకిట్లోనే పార్వతి కన్పించింది. అత డాశించినవిధంగా కాకుండా పార్వతి అతణ్ణిచూడగానే ముఖం మలినపరచుకుని తలవంచుకుని

ఇంట్లోకి వెళ్ళిపోయింది. చంద్రశేఖరాని కేమీ తోచలేదు. అతడు స్తబ్ధుడైపోయినాడు. హతబుద్ధిఅయిపోయినాడు.

పార్వతి మళ్ళీ బయటకువచ్చి "కూచో చిన్నబావా, నాన్న ఊళ్లో లేడు!" అన్నది తలవంచుకునే.

తల పైకెత్తి ఆ కళ్ళలోకి చూడాలనిపించింది చంద్రశేఖరానికి. చుట్టూ కలయచూశాడు. "పార్వతీ!" అన్నాడు. పార్వతి అతడికంఠంలోని విహ్వాలతను చూసి తెల్లబోయింది. అతడివేపు నిర్నిమేషంగా చూసింది.

"నేను మీ ఇంటికి రావటం నీకు ఇష్టంలేదులా వుంది కదూ?" అన్నాడతడు లేనినవ్వు తెచ్చిపెట్టుకుంటూ.

"అదేమిటి చిన్నబావా, అలా అంటావు?" అన్నది పార్వతి.

"మరయితే నువ్వలా మారిపోయావేం?" అన్నాడు.

పార్వతికి యీసారి నిజంగానే నవ్వువచ్చింది.

ఇంకాస్త దగ్గరకు జరిగి "నే నెలా వున్నానూ" అన్నది.

చంద్రశేఖరానికి తనలోపలవున్న భావం, తను చెప్ప దలచుకున్న భావం ఎలా చెప్పాలో తోచటంలేదు ఎంతకూ.

"సరస్వతి ఇంత త్వరగా వెళ్ళిపోయిందేం చిన్నబావా? పెద్దబావకొడుకు బావున్నాడా?" ఏవేవో అడుగుతున్నది పార్వతి.

అతడివన్నీ వినిపించుకునేస్థితిలో లేడు. తాను ఎలా చెప్పాలి? అని మధనపడుతున్నాడు.

మంచినీళ్లు తెమ్మని చెప్పాడు. అప్పుడు పార్వతి తనకు ఇంకా దగ్గరకు వస్తుందని అతడినమ్మకం.

పార్వతి లోపలకు వెళ్ళి తీసుకొచ్చింది. తనవక్కన వుంచుతుండగా వణికేచేతితో పార్వతి చెయ్యిపట్టుకున్నా డతను.

పార్వతి ఆశ్చర్యపడ్డది. జాలిగా ముఖం పెట్టుకుని "ఇదేమిటి చిన్నబావా!" అన్నది.

"నీ కిష్టమేనా పార్వతీ..." అన్నాడు తడబడుతూ.

"ఏమిటి బావా?" అన్నది పార్వతి చెయ్యివదల్చుకుని.

"నేను నిన్ను పెళ్ళిచేసుకుంటాను. నాకు...నీకు... ఇష్టమేనా?" అన్నాడతను.

పార్వతిముఖంలో సంతోషమూ లేదు, విచారమూ లేదు. బాధగా ముఖంమార్చుకుని "ఇప్పు డేం లాభంలేదు చిన్నబావా!" అన్నది.

ఆ మాటతో చంద్రశేఖరానికి విపరీతంగా భయం పుట్టింది. తన సొత్తుని, తన ప్రాణాన్ని, తన ఆత్మని ఎవరో తననుండి బలవంతంగా వేరుచేస్తున్నట్లు అనిపించిందతడికి. గట్టిగా ఆమెను కౌగిలిలోకి పొదువుకుని ఎవరికీ చిక్కకుండా ఎటేనా పారిపోవాలనిపించింది ఆమెతో. ఆశగా పార్వతికళ్ళలోకి చూశా డతను. పార్వతికళ్ళలో నీళ్ళు నిలిచాయి.

అతడు వివశుడైనాడు.

ఆమెకళ్ళనీళ్లు తుడిచాడు.

తనలో పొదువుకుందామని ఆమె బుజాలని బలంగా పట్టుకుంటే భయంతో, బాధతో పార్వతి వదుల్చుకుని ఇంట్లోకి వెళ్ళిపోయింది. అతడికళ్ళముందు చీకటి కమ్మినట్లైంది.

"ఏమయ్యా" అని రామ్మూర్తిమామయ్యభార్య పలకరించింది. ఆమెవెనుకనే పార్వతి నిల్చునివుంది. అతడు

వెళ్ళిపోవటానికి అడుగు ముందుకేశాడు. ఆమె "వుండు నాయనా" అన్నది.

"మీ మామయ్య మా మేనమామవగారి ఊరెళ్లాడు. అక్కడ ఏదో సంబంధం వున్నదంటే చూసిరావటానికి..."

చంద్రశేఖరం వెలవెలబోయినాడు.

"ఉన్న వూళ్లోనే వుంటుందనుకున్నాము. ఎన్నో అనుకుంటాం మనం, అన్నీ జరుగుతాయా" అన్నదామె.

"జరుగుతాయి కావాలని నిజంగా వుంటే..." అన్నాడతను పెగల్చుకొని.

ఆమె తెల్లబోయింది.

అతడు తలవంచుకుని "పార్వతిని నేను పెళ్ళిచేసుకొంటాను మీ కిష్టమైతే" అన్నాడు.

అతడు వెళ్ళిపోయినాడు.

ఆమెమాట్లాడేది విందామని అనిపించలేదు. దారిలో వేణుగోపాలస్వామిఆలయంలో గంటలు మ్రోగటం విన్నాడు. అప్రయత్నంగా అతడి కెన్నెన్నో సంఘటనలు గుర్తుకువచ్చాయి. గబగబా ఇల్లు చేరుకున్నాడు.

తల్లి వోమూల కూచుని కన్నీళ్లుపెట్టుకుంటున్నది. దగ్గరగా కూచుని "ఏమిటమ్మా" అన్నాడు కరుణావిలసమైన స్వరంతో. ఆమె సగం అర్థమయ్యేలా చెప్పింది.

"పెద్దకొడుకు ఇంట్లోంచి లేచిపోతున్నాడట. అవతల వీథిలో వేరే ఇల్లు మాట్లాడుకుని వచ్చాడట ఇవాళ"

చంద్రశేఖరానికి తల తిరిగిపోయింది.

అతడింకేమీ అడగలేదు.

అక్కడినుంచి లేచిపోయినాడు.

మర్రోజున్నే సూరినారాయణశాస్త్రి కొద్ది సామాను వేరుచేయించి బడిపిల్లలతో ఆ ఇంట్లోకి చేర్పించటం చూశాడు చంద్రశేఖరం.

తండ్రి నిర్లిప్తుడుగా వుండిపోయినాడు.

తల్లి మాత్రం కళ్లుతుడుచుకుంటూనే వుంది.

సూరినారాయణశాస్త్రి కొత్తఇంట్లోకి చేరిన మూడో రోజున చంద్రశేఖరం తనకు ఉద్యోగంవచ్చిందని తెలియ చెయ్యాల్సిందిగా జోసెఫ్‌కు చెప్పాడు. జోసెఫ్ సూరినారాయణశాస్త్రికి చెప్పినప్పుడు సూరినారాయణశాస్త్రి నిజంగా సంతోషించాడు, ఆవిషయం నిజమని!

చంద్రశేఖరం ప్రయాణమై వెళదామనుకుంటూండగా పార్వతి స్వయంగా తానేవచ్చింది వాళ్ళింటికి. చంద్రశేఖరం ఆశ్చర్యపోయినాడు. పార్వతి అతడిచేతుల్లో రెండుఉత్తరాలు పెట్టి వెంటనే వెళ్ళిపోయింది. ఒకటి రామశాస్త్రినుంచివచ్చింది మామూలు క్షేమసమాచారాలతో. రెండోది పార్వతి స్వయంగా వ్రాసినది.

చంద్రశేఖరంమొహంలో పార్వతివుత్తరం చదువు కున్నతర్వాత రంగురంగుల మార్పులు కదిలినయ్.
కళ్ళలో కాంతి కదిలింది. నిట్టూర్చాడు "తనకు
చిన్న ఉద్యోగం దొరికితే, చిత్తశాంతిని కూర్చుక
బ్రతకగలడు" అనుకున్నాడు. వెంటనే ప్రయాణ
రైలు మామూలుగానే వచ్చింది
నారాయణ రైలుస్టేషనులో పలకరించి

వస్తారుకదూ" అన్నప్పుడు అతడు పలకలేదు. రైల్లో కూర్చుని కిటికీలోంచి తన ఊరిదెస చూసినప్పుడు విశాలప్రపంచంలోకి జీవితంలోని సుఖాన్ని వెతుక్కుంటూ వెళ్ళిపోతున్నానన్న భావమే అతడిలో మిగిలింది. ఈ అన్వేషణ ఎప్పుడో ముగిసినప్పుడు మళ్ళీ యీ వైపుకి వస్తాడు తను.

రైలు కదిలిపోయింది.

అందులో కూచున్న చంద్రశేఖరానికి తాను వొంటరివాడై పోతున్నానన్న భావం మనసులో మెదిలి కళ్ళవెంట నీళ్ళువచ్చినయ్.

తల్లీ, తండ్రీ, వదినా, అన్నయ్యా, చిన్నపిల్లవాడూ, పార్వతీ...అంతా తనకు దూరమైపోతున్నారు నిమిష నిమిషానికీ—

[illegible]నకూన్యమైన తన ఇంటినిగూర్చీ, తల్లినీ తండ్రినీ గూర్చి అతడిలా అనుకున్నాడు:

తండ్రికి ఎప్పుడో బాగా కోపంవస్తుంది. ఎందుకంటె పొయిముందుకూచుని కళ్ళనీళ్లుకారుస్తూ ఏ ఆలోచనలతోనో వుంటుంది తన తల్లి. అప్పుడు అన్నమంతా పొయిలో పడుతున్నా గమనించలేదు. అప్పుడు తండ్రి ఆ దృశ్యాన్నిచూసి కోపంతో హెచ్చుస్థాయిలో "ఏం నీ కళ్ళు పోయినాయా" అని [illegible]ష్టు.

[illegible]మె జాగ్రదావస్థలోకి వచ్చి, "అవును, నా కళ్లు పోయి[illegible] కళ్లూ పోయినయ్" అంటుంది కళ్లు తుడుచుకుని.

[illegible]న్నది. రైల్లో చంద్రశేఖరం వెళ్ళిపోతున్నాడు.